# ఒక మాట

తరతరాలుగా బ్రిటిష్ ప్రభుత్వ దాస్య నిగళాలలో బంధింపబడి ఆంధ్రభాషామతల్లి శిధిలశకల హృదయయై, కృంగి, కుమిలి కృషించి పోయి స్వతంత్రానంతరం స్వేచ్ఛావాయువుల పీలుస్తూ తన పూర్వో న్నత్య స్వరూపాన్ని తీర్చి దిద్దుకొనుటకుగా, భాషా రాష్ట్రాల విభజన కాలములో తన ఏకైక ఆంధ్రోర్విని సాధించి మహోన్నత భావవిస్తృత, భాషానిలయయై పరివర్తన నొందు టిప్పటిప్పుడే యని సమస్తాంధ్ర భాషాభిమానులకు విధితమే గదా!

నేడు మన సమాజంలోని అవినీతి, అక్రమ, అన్యాయ, అధర్మ పద్ధతులు, కరుడుగట్టిన చాందసబూర్జువాచారాలు, భూత, ప్రేత, పిశాచ స్వార్థాభినయ విన్యాస హాస చంద్రికలై అమాయకులను పీడిస్తూ హింసిస్తూ సర్వనాశనం చేస్తుందంటే ఇది అతిశయోక్తి కాదని మన మందరము గ్రహించిన విషయమే?

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కలిగికూడ నేడు రచయితలు సమా జములో ఎగుడు దిగుడు సమస్యలను పరిపూర్ణ భావోద్రిక్తులై వ్యక్తం చేయటానికి సంకోచిస్తు రచనలు సాగిస్తున్నారు.

కాని రచయితల ధర్మమదికాదని నా అభిప్రాయము. సమాజ సంస్కరణాను కూలముగాని రచనలు అడవిన కాచిన వెన్నెలవలె, సంఘ, సంస్కారమునకు దోహద మొనర్పవని నా విన్నపము.

ఈ నా "దొంగా ఒక మనిషే!" అను కథల సంపుటిలో సాంఘిక దురన్యాయాలకు బలియై మానవుడు ఒక దొంగగా మారడం

జరిగినది అలాగే మంచి ముహూర్తాన్వేషణకై నిరీక్షిస్తూ వల భ్రష్టత నేర్పడు సమయానికి విసుగెత్తి, అట్టి కార్యము ప్రతిక్షణము శుభమే యనుకొని, నిర్వహించిన ఫలితంగా, తన ఆత్మ తృప్తి యీ దేరు ఒక బంగారుపాప జనిస్తాడు. కలవారి యింటిబిడ్డ గారాబు తనము భర్తను తిరస్కృతి గావించి, పుట్టింటి కాపురం చేస్తూ దైవ విధిచే తన దివ్య సౌందర్యాది ధనముల కోల్పోయి పశ్చాత్తాప మనస్వియై, సతికి పతి దైవమని గ్రహించి ప్రియనాధుని ప్రేమకు పాత్రమౌతుంది. నాల్గవ కథలో వితంతు బాలికా దుర్భర వేదనా పరితత్వమును రూపు మాప టానికి, వితంతూద్వాహాలను ప్రోత్సహించ నైనది. ఇత్యాది కథా వస్తువుల సంగ్రహమే ఈ కథల సంపుటి.

ఈ గ్రంధ ముద్రణకు సహకరించిన వారిలో ముఖ్యులు శ్రీ శీలం అల్వాల్‌రెడ్డి పోలెపల్లిగారు, శ్రీ తుమ్మలపల్లి వెంకట్రాంరెడ్డి కొట్టాల గారికి నా కృతజ్ఞతలు.

ఇట్లు,
రచయిత

# దొంగా ఒక మనిషే!

ఆరోజు ఉదయం నుంచీ ఆకాశమంతా మబ్బుమబ్బుగానే ఉంది. మధ్యమధ్యన తుంపర తుంపరగా వాన పడుతూనే వుంది. సాయంత్రం అవుతున్నకొద్దీ తుంపర పెద్ద వర్షముగా మారింది. ఎవరుకూడ యిండ్ల నుంచి బయటకు వెళ్లటలేదు. రాజేంద్రుడు ఆదినము ఆఫీసుకు సెలవు పెట్టి రోజంతా యింట్లోనే వున్నాడు. తనగదిలో కూర్చుని వారం రోజులక్రితం "ఆంధ్రపత్రికలు" (దినపత్రిక) తిరుగవేస్తున్నాడు. అప్పటికి సుమారు ఏడుగంటలు కావచ్చు. పట్టణములో విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. కిటికీలోనుంచి వీచేగాలి చల్లగావుంది. యింతలో ఎవరో వీధితలుపు తట్టినట్లు శబ్దమయింది. రాజేంద్రుడు కిటికీలోనుంచి బయటకు తొంగిచూశాడు. ఎవరో వర్షానికి తట్టుకోలేక ఆశ్రయమడుగు తున్నాడు కామాలు అనుకొని ఆతడు వెళ్ళి తలుపుతీశాడు. ఆతనిని చూడటములోనే ఆశ్చర్యపోయాడు రాజేంద్ర.

"నన్ను రక్షించు బాబు! నీకు పుణ్యముంటుంది. పోలీసులు వెంబడిస్తున్నారు" అంటూ అతడు రాజేంద్రుని కాళ్ళమీద వాలిపోయాడు.

"జైలునుంచి పారిపోతున్నావా?"

"అవును"

"కారణం....!"

"తరువాత చెపుతాను. మొదలు రక్షించండి బాబు!"

"నీకు ఆశ్రయమిచ్చి నేను ప్రభుత్వాన్ని మోసం చేయలేను" అన్నాడు రాజేంద్ర శూన్యంగా ఆకాశంలోకి చూస్తూ.

"నేను దొంగనుకాను. నేనొక మానవత్వంగల మనిషినే బాబు" అన్నాడు దీనంగా రాజేంద్రుని ముఖంలోకి చూస్తూ.

ఎందుకో అతనిని రక్షించాలనే ఆదుర్దా (అపేక్ష) రాజేంద్రునికి కలిగింది. రాజేంద్రుడు మంచి అభ్యుదయ భావాలు గలవాడు. సంస్కార ప్రియుడు. ఒకరి హృదయంలో బాధను అర్థంచేసుకొని సానుభూతి తెలిపే శాంత స్వభావి. ఆతని అమాయక దీనావస్థనుచూచి ఆతను దొంగకాడని తెలుసుకోవటానికి రాజేంద్రునికి ఎంతోసేపు పట్టలేదు.

"సరె! మంచిది, అలాకూర్చోండి!" అని రాజేంద్రుడు అతనికో కుర్చీ చూపించాడు.

"బట్టలు మార్చుకుంటారా!"

"అవసరం లేదండి....!"

"మరి మీబట్టలు తడిసిపోయినవిగదా! చలిపెట్టటంలేదూ?" అన్నాడు రాజేంద్ర ఆశ్చర్యంగా.

"ఎంత చలిబాధనైనా భరిస్తానండి!"

"లక్ష్మీ! ఎవరో అతిధివచ్చారు కాఫీపట్టుకరా" అని రాజేంద్ర యింట్లోకి కేకవేశాడు.

"లక్ష్మిలేదురా! యిప్పుడే వస్తానని బయటికి వెళ్లింది" అంది రాజేంద్రుని తల్లి యింట్లోనుంచివచ్చి.

"యింతవర్షంలో ఎట్లా పోయిందమ్మా!" అని రాజేంద్ర సంభ్రమాశ్చర్యాలను వ్యక్తంచేశాడు.

"లక్ష్మి ఎవరండి?" అని అతడు ఆశ్చర్యంతో అడిగాడు.

"మా యింట్లో పని మనిషిలెండి"

ఎందుకో అతని కండ్లవెంబడి అప్రియత్నంగా కన్నీరు కారుతోంది. ఇదంతా రాజేంద్రునికి ఏమీ అర్థంకావటంలేదు. అర్థంలేని కన్నీరు అతని కండ్లవెంబడి యింకా కారుతూనేవుంది.

"ఎందుకండీ! అలా కన్నీరు కారుస్తున్నారు?" న్నాడు రాజేంద్ర.

"నాచెల్లెలు పేరుకూడ లక్ష్మి! అది జ్ఞాపకమొస్తె...."అని అతను కన్నీరు తుడుచుకుంటున్నాడు.

"లేదు మీరేదో చెప్పటానికి సందేహిస్తున్నారు. మీమనస్సులోని ఆబాధ ఏమిటో చెప్పండి!"

"నాజీవితాన్ని గురించి తెలుసుకోవాలని వుందా? ఈప్రపంచములో ఒకరి కష్టసుఖాలను తెలుసుకునేటంతటి తీరిక యింకొకరికి వుందా? నాలాంటివారి జీవితాలను అర్ధంచేసుకోవటానికి యెవరికీ తీరుబడిలేదు"

"లోకమంతా దుర్మార్గులతో నిండివున్న దనుకోవటం పొరపాటు, యిక్కడ సజ్జనులు సైతంలేకపోలేదు. మీజీవితంలోని దుఃఖాంధకార మైన గత చరిత్రను చెప్పండి. సాటి మానవునికి హృదయావేదనను వెల్లడించుకుంటె ఆత్మకు శాంతి వుంటుంది"

"నిజంబాబు! హృదయావేదనను వినడానికి ఉదారుడైన హృద యుడు కావాలి. చెప్పుకునేవానికి శాంతివుంటుంది. నాజీవితం చాల విచిత్రమయినది. మానవుడు ప్రపంచములో ఏమేమో వూహించు కొంటాడు. అవన్నీ నెరవేరుతాయని కలలు గంటాడు. ఆశలు నిరాశ లయితే వ్యధను భరించలేడు. ఇలాగే పరిణమించినది నాజీవితం. నాకు జీవితంలో అన్నీ అవమానాలే ఎదురైనాయి. అవధులు దాటితే మాన వుడు అవమానాన్నికూడ భరించలేడు. నాకిప్పుడు నా అనేవాళ్లు ఎవరూ లేరు. నాపేరు రాము. నాకు కొంతమంది బంధువులుకూడ లేక పోలేదు. నాస్థితిచూసి వాళ్ళందరూ దూరమయ్యారు. ఇదిలోకంలో సహజమేగా! 'సంపదలు కలిగిన దినాలలోనే ఎక్కడలేని బందుగులు' అనే లోకోక్తి తెలిసిన విషయమేగా! నేను ఎటువంటి నక్షత్రాన పుట్టానోగానీ నాకు చిన్నతనమునుంచి అన్నీ కష్టాలే. కష్టాలను

భరించేశక్తి మీకంతగా లేకపోవచ్చు. కాని నాకవి బాగా అలవాటయాయి. నాలో అవి అజీర్తి చేయకుండా బాగా జీర్ణించుకపోయాయి. యిప్పుడు నేను జైలునుంచి పారిరావటానికి గలకారణం నాచెల్లెలు లక్ష్మి ఎక్కడుందో వెతకాలని మాత్రమే. నాచెల్లెలు ఒకవేళ కనిపిస్తే దానినొక యింటిదానిగాచేసి తిరిగి జైలుకు వెళ్లటం నాకిష్టమే. కాని ఆమె కనిపించాలిగా. కనిపిస్తే నామాటను తప్పకుండా నిలబెట్టుకుంటాను. సత్యానికి, న్యాయానికి, ధర్మానికి కట్టుబడివుండటమే మానవుని పరమావధిగా ఇప్పుడు నేను జైలునుంచి పారిరావటంతప్పే. కాని నాలో ప్రతి అణువు నాచెల్లెలు క్షేమాన్ని కోరుతుంది. ఆమెపై నాకున్న ప్రేమ నాలో ఒక ప్రవాహంలా పారుతుంది. ఇలాంటప్పుడు నాకలా చేయటం తప్పలేదు. ఇంతఘోరమైన జైలుశిక్షను అనుభవించటానికి నేనుచేసిన నేరంకూడ ఏమిలేదు. నాకు శిక్షను విధించిన ప్రభుత్వ న్యాయస్థానాదికారిది తప్పులేదు. డబ్బుకాశబడి నన్ను నేరస్తుడుగాచేసిన ప్రభుత్వ ఉద్యోగులు చేయరాని పనులుచేసి ప్రభుత్వాన్ని మోసం చేస్తున్నారు. ఇంతకిత్రమే నేనొకసారి జైలుకు వెళ్ళాను. అసలీ ప్రపంచములో నాలాంటి నిర్భాగ్యుల్ని భగవంతుడు ఎందుకు పుట్టిస్తాడో అర్థం కాదు. జీవితమంతా భారంగా బాధలలోనే కాలం గడచి పోతుంది. దేశంలో ఎంతోమంది ఆకలి మంటలు చల్లార్చుకోలేక దరిద్ర దేవత ఒడిలో శాశ్వతంగా కన్నుమూస్తున్నారు. మానాన్న చనిపోగా వ్యవహార భారమంతా నానెత్తిమీద పడింది. ఆయన మిగిల్చిపోయిన ఆస్తికూడ ఏమిలేదు. అప్పుడు మాకు పూట గడవటమే కష్టంగా వుండేది. ప్రపంచములో సంపదలు అందరివద్దా సమానంగా వున్నప్పుడు దొంగతనాలు, హత్యలు, కుట్రలు, మోసాలు జరగవనుకుంటాను. ఒక సుప్రసిద్ధ రచయిత అన్నట్లు "ప్రపంచంలో దుఃఖాలకీ, దౌర్జన్యాలకీ సగం కారణం ధనంమీది వ్యామోహం. సగం కారణం ధనంలేక

పోవడమే." సంపదలన్నీ స్వార్థపరుల హస్తగతమైనాయి. నేను మా వూళ్ళోనే స్కూల్ ఫైనల్ వరకు చదువుకున్నాను. జీవనోపాధి కొరకు ఉద్యోగము చేదామని తిరుగరాని చోటల్లా తిరిగాను. కాని ఎక్కడా ఉద్యోగం దొరుకలేదు. అయినా ఈరోజుల్లో మాలాంటి బీదవాళ్ళకు ఉద్యోగాలు ఎక్కడ దొరుకుతాయి. ఏ రెకమెండేషనో ఏ సిఫారసో వుంటేగాని ఉద్యోగం మాట తలపెట్టవద్దు. ఈపరిస్థితిలో లక్ష్మికి పెండ్లి చేయవలసిన బాధ్యత నామీది కొచ్చింది. నన్ను ఎన్ని కష్టాలైనాపడి లక్ష్మికి మంచి సంబంధం చూసి పెండ్లిచేయమని మాఅమ్మ తుదికోరిక. వయస్సు వచ్చిన చెల్లెలును యింట్లో ఎంత కాలం వుంచుకుంటావు. పెద్దమనిషై మూడు సంవత్సరాలు కావస్తుంది. పెండ్లి వేగం చేయక పోతె సంఘంనుంచి బహిష్కరించ బడుతావు అన్నట్లుగా లోకం నన్ను హెచ్చరించింది. అమ్మలక్కలు నవ్వుకుంటూ అపహాస్యం చేస్తున్న ట్లుగా కనిపించారు. నాలో ఆత్మాభిమానం దెబ్బతిన్నది. అంతవరకూ సక్రమ మార్గాన నడచిన నా జీవితాన్ని దొంగతిరుగుడుగా త్రిప్పాను. నేను సుఖంగా బ్రతకాలి. సుఖంగా బ్రితకాలంటే డబ్బుకావాలి. అందుకోసరం నేను ఎలాంటి పాపాలైనా చేయటానికి సిద్ధపడ్డాను. అప్పటి నానిర్ణయం మీకు తప్పుగా కనిపించవచ్చు. నా ఈస్థితిలో ఎవరున్నా నాలాగే నిర్ణయించుకోక తప్పదు. ఎవరివద్దా న్యాయం, ధర్మం, అనే వస్తువులు లేనప్పుడు వాటిని నాదగ్గర వుంచుకోవడం నాకేసిగ్గని పించింది. చెల్లెలుకు మంచి సంబంధం చూడాలని చాలదిక్కులతిరిగాను ఎక్కడ మంచి సంబంధం దొరుకలేదు. అందరు వేలమీదనే కూర్చున్నారు. తుదకు ఎలాగో ఓసంబంధం వేయినూట పదహార్లకు నిశ్చయమైనది. తాంబూలాలుకూడ తీసుకున్నాము. పెండ్లి వారం రోజులు చిక్కింది. డబ్బుకోసరము మావూళ్ళో మంచి పలుకుబడిలోవున్న గంగాధరం దగ్గరకు వెళ్ళాను. అయనకు నాకు చాల మంచిస్నేహం

కొన్నాళ్ళనుంచి అతను చెప్పిన పనల్లా చేశాను. అతనుచెప్పినట్లల్లా చేయటంచే మా జీవనోపాధి బాగా జరుగుతుండేది. ఆయన సహాయం చేస్తావని మాట యిచ్చిన తరువాతనే నేనా సంబంధాన్ని నిశ్చయించాను. తీరా అడిగేవరకు యిప్పుడేమి తొందర? ఇంకా కొన్నాళ్లు ఆగరాదా? ప్రస్తుతము నావద్ద డబ్బులేదు. ఈసంబంధం కాకపోతే మరొక సంబంధం వస్తుందిలే అన్నాడు. తనవద్ద డబ్బువుంచుకొని ఇలా మాట్లాడినందుకు గంగాధరంపై నాకు చెప్పలేని కోపం వచ్చింది. నాహృదయంలో చెలరేగుతున్న బాధ, అంతరాత్మలో క్షోభిస్తున్న ఆవేదనను సవివరంగా చెప్పాను. అతనికి దయకలుగలేదు. నామాటను గడ్డిపరకకంటె తేలికగా తీసిపారవేశాడు. ఇన్నాళ్ళు నేను అతనితో చేసిన స్నేహమంతా "బూడిదలోపోసిన పన్నీరుగా" మారింది. ధనవంతులతో స్నేహంచేయటం "నిప్పుతో చెలగాటాలాడటం" అని నాకిప్పుడు బాగా తెలిసింది. నాదృష్టిలో ధనవంతులంతా పరమ ఛండాలురనీ, వాళ్ళలో నీతి నిజాయితీ అసలుకే కనిపించదనీ, నాకు మొదలే తెలుసు. ఇదంతా తెలుసుండికూడ నేను అతనితో స్నేహం చేయడం నాదే తప్పు. కాని ఏమిచేస్తాను. జీవనోపాధికొరకు అలా చేయవలసి వచ్చింది. అతనితో స్నేహం చేసిన స్వల్పకాలంలోనే నేను ఎన్నో చేయరాని తప్పుడు పనులు చేశాను. అలాచేయకపోతే విధిలేదుగా? నేడు ఎంతోమంది ఇలాంటి పెద్దమనుష్యులు, సమాజంలో తమ గౌరవ మర్యాదలు కాపాడుకునేటందుకు, డబ్బుకు ఆశపడ్డ మాలాంటి అమాయకులను ముందుకు తోసి, నీచాతి నీచమైన పనులు చేయిస్తున్నారు. ఇక డబ్బుకొరకు ఏం చేయాలి? ఎక్కడికి పోవాలి? అనే ఆలోచన నామనస్సును పాడుచేసింది. అభిమానాన్ని చంపుకొని అడుగరాని వాండ్లను అడిగాను. కన్నీటితో నాదుఃఖాన్నంతా చెప్పుకున్నాను. ఎవరికీ నామీద కరుణ కలుగలేదు."

"దారిద్ర్యంమానవుడ్ని స్వార్ధపరునిగానూ, నీచుడుగానూ తయారు చేస్తుందిగానీ అతని శీలాని కేమాత్రం మెరపు పెట్టలేదు," అనే సోమ ర్సెట్ మామ్ చెప్పిన మాట వాస్తవం. ఇక నాకు ఒక్కటే మార్గం కనిపించినది. డబ్బుకొరకు ఎక్కడైనా దొంగతనం చేయాలి. యింకె క్కడ? గంగాధరం యింట్లోనే ఆపని జేశాను. పీటలమీది పెండ్లి చెడిపోయినది. గంగాధరం ప్రత్యక్షసాక్ష్యంతోసహా నన్ను కనికరం లేకుండా పోలీసువారికి అప్పగించాడు. నాచేతులకు సంకెళ్లు పడిపోయి నవి. "అన్నయ్యా!" అంటూ బాంధవ్య మమకారంతో లక్ష్మి అరచింది. ఏడ్చింది. కాని లాభం....?

"లక్ష్మీ! నేను త్వరలోనే వస్తాను. నీకేమీ భయంలేదు. మన పక్కింటి సీత నీకు తోడుగా వుంటుంది. నీవు మాత్రం కామాంధకారు డైన గంగాధరాన్ని కాపాడుకొని తిరుగు" అని చెప్పిపోయాను కూడ.

"కాని నేను జైలునుంచి తిరిగివచ్చేవరకు గంగాధరం అనుకున్న పనిచేశాడు. ఎవరి కోసరమైతే నేను తహ తహ లాడుతూ యింటికి వచ్చేనో ఆముద్దుల చెల్లెలు నాకు కనిపించలేదు. ఈలోకంలోని కాకులు ఆమెను తరిమివేశాయి."

ప్రియమైన అన్నయ్యా!

నేను చేయరాని తప్పుపని చేశాను. నేను ఎంతో ప్రాధేయపడి ఆ దుర్మార్గుడికి చెప్పాను. అనాధననీ. అభాగ్యననీ మొరపెట్టుకున్నాను. భవిష్యత్తులో నాజీవితం వ్యర్ధం అనీ చెప్పుకున్నాను. కాని లాభంలేక పోయింది. నన్ను మోసంచేశాడు. నిన్ను జైలునుంచి విడిపించగలనని కల్లబొల్లి మాటలు చెప్పాడు. అతని మాటలు నమ్మి నాశీలాన్ని చెరుపు కున్నాను. నాజీవితాన్ని పాడుచేసుకున్నాను. నేనేమి చెయ్యను. అన్ని విధాల పతిత నయ్యాను. పెండ్లికాకముందు ఇలాంటి పాడుపనిచేసి నీకు

ముఖం యేలాచూపించాలి. నీతోబుట్టువు కులట, వ్యభిచారిణి అనితెలిస్తే నలుగురిలో నీకు తలవంపులు. చేసిన పాపానికి ప్రతిఫలం కనిపించ గలదనే భయంతో నేనీవూరు విడిచిపెట్టి పోతున్నాను. ఎక్కడికెళ్లు తున్నానో చెప్పలేను. ఎన్నటికైనా నీవు క్షమించగలవనే ఆశతో జీవిస్తాను

ఇట్లు,
లక్ష్మి.

"నేనా ఉత్తరం చదవగానే హృదయం వేగంగా కొట్టుకోవటం అధికమయింది. చేతులు వణికిపోయినాయి. నాలో ప్రతీకారపు జ్వాలలు చెలరేగినయ్. ఆవేశం, క్రోధం కట్టలు తెంచుకున్నై. నాచెల్లెలు జీవితాన్ని నాశనం చేసిన గంగాధరమును ఏవిధంగానైనా హతమార్చాలి. మానవ నాశనాన్ని కోరేవారిని నాశనం చేయటమే మంచిదని నిశ్చయించుకొన్నాను. నారక్తాన్ని పంచుకొని పుట్టిన నాచెల్లెలు ఈ విధంగా అవమానింప బడటం నే భరించలేక పోయాను."

అది అర్ధరాత్రి సమయం, ఆకాశమంతా నల్లని మేఘాల ముసుగును కప్పుకుంది. అంతరాత్రి వరకు నాకు నిద్రపట్టలేదు. నేను తలపెట్టే పని నెరవేరేటంతవరకు నాకు శాంతి వుండదు. అయితే ఆపని ద్వార జరిగే ఉచితానుచితాలను యోచించేవివేకం నాలో వుండదు. తరువాత చేసిన పనికి పశ్చాత్తాపం చెందుతాను. వీధిలో భయంకరంగా కుక్కలు అరుస్తున్నాయి. ఆ కటిక చీకట్లో అర్థహీనంగా నవ్వుకుంటూ కార్యసాధన కోసరము వెళ్ళాను. ప్రహరీగేటు దగ్గర కాపలావాడు గాఢ నిద్రలో ఉన్నాడు. మెల్లగా గేటు లోపలకు వెళ్లాను. తన గదిలో గంగాధరం గాఢ నిద్రలో గుర్రు పెడుతున్నాడు. ఏకారణం చేతనో ఆక్షణాన నా మనస్సు మారిపోయింది. ఆతని ప్రాణాలను తీయటానికి నా మనస్సు యిష్టపడలేదు. మానవుడిని మానవుడే హత్య చేయటం

మంచిది కాదనిపించింది. కాని అతనికి తగిన బుద్ధి చెప్పాలనే అభిప్రాయంలో "ఒరే! దుర్మార్గుడా లే, అని పెద్దగా అరిచాను. గంగాధరం లేచి ఆశ్చర్యంగా "సువ్వా" అన్నాడు.

"అవును. నేనే...! నీవు మనిషివికావు. నీకు హృదయంలేదు. నాచెల్లె జీవితాన్ని నాశనం చేశావు. నమ్మిన వాళ్ళను ఈ విధంగా ద్రోహం చేసే కాలహంతకుడా? నిన్నేమి చేసినా పాపం లేదు. కాని నిన్ను క్షమిస్తున్నాను. భయపడకు. నీకేమి అపాయంలేదు. కాని నేను చెప్పే విషయాలు శ్రద్ధగా విను. మీరు మహానుభావులు. సంఘములో మంచి హోదా, పలుకుబడి గల వ్యక్తులు. మీలాంటి వారు యింతటి ఘోర పాపాలకు తలపడటం సిగ్గుచేటు. ఇలా పరస్త్రీలకు ఆశపడి అవినీతికి పాల్పడటం అన్యాయం. కామాంధకారంలో పడి పశువులకంటె హీనంగా ప్రవర్తించటం మానవుని ధర్మంకాదు. అమాయకురాలైన నాచెల్లెలు జీవితాన్ని నాశనం చేసిన పాపం నీ జీవితంలో ప్రవేశించి ఇహపరాల్లో సౌఖ్యం లేకుండా చేస్తుంది. క్షణకాలపు సౌఖ్యం కోసం వివేచనా జ్ఞానరహితుడపై అజ్ఞానాంధకారంలో పడి మానవత్వాన్ని మరచిపోవటం మంచిదికాదు. ఇలా మీరు చీకటి ముసుగులో ఎన్నినేరాలు చేసినా లోకం మిమ్మలనే గౌరవిస్తుంది. ప్రేమాభిమానాలు చూపుతుంది. కాని పరలోకంలో మీ పాపకార్యాలను భగవంతుడు క్షమించడు. ఆయన దగ్గర సర్వమానవులు సమానులు. చేసిన నేరానికి శిక్ష తప్పక విధించబడుతుంది. బంధుప్రీతి, ప్రేమాభిమానములుండవు. ధనమనేది మీ దగ్గర లేకపోతే మీరొక మనుష్యులు కారు. మీకంటె ఎన్నోరెట్లు నిర్భాగ్య జీవితం గడిపే నిరుపేదలేనయం. ఇకనైనా కళ్లు తెరచుకొని తెలుసుకోండి సత్యం. మీకులాగానే అందరికి ఇల్లాండ్రు, చెల్లెండ్లు వున్నారు. ఇలాగే మీ వాళ్ళను ఎవరైనా ఏమైనా చేస్తే వూరుకుంటారా? ప్రతీకార చర్య తీసుకొనంది మీకు నిద్రపట్టదు. మీలాగే అందరను

కొనంచి ! అమాయకుల బ్రతుకుల్లో నిప్పులు పోయకండి....!" అని యీ విధంగా నా మనస్సులోని ఆవేదనంతా ఉద్వేగంలో వెళ్లగ్రక్కాను.

నాయీ మాటలు అతనిని కించిత్తు కూడ చలనం కలిగించలేదు.

"ఈ నీతులు ఎవరు నేర్పారోయ్ !" అన్నాడు గంగాధరం విచిత్రంగా నవ్వుతూ.

"నీతి, అవినీతి, న్యాయమూ, అన్యాయమూ, ధర్మమూ, అధర్మమూ, ఆలోచించకుండా పాపాలు చేస్తే పరిస్థితులు నేర్పుతాయి. అవినీతిలోని తీయటి ఆనందం కోసం, అపవిత్రత కలిగిన అనుభూతుల కోసం వెళ్ళితే అశాంతి జీవితంలో అనర్థకాలు నేర్పుతయ్" అన్నాను నేను మరింత ఆవేశంతో.

"అర్ధరాత్రి వేళ ఎవరి అనుజ్ఞలేనిది ఇలా రావటంలోని కారణం యిదేనా ?"

"అవును. పగిలిన హృదయంలోని, చెదరిన మనస్సులోని ఆవేదనను చెప్పేకోవటానికొచ్చాను."

"అయితే, మళ్ళొకసారి జైలుకు వెళ్ళితె మరింత మంచిగా తెలుస్తుందిలే !" అని గంగాధరం కాపలావాండ్లను పిలిచి నన్ను రెక్కలు విరచి కట్టించాడు నిర్దాక్షిణ్యంగా. హత్య చేదామని పోయి అనవసరంగా అతనిని క్షమించి వూరుకున్నందుకు నాకే ముప్పొచ్చింది. వీళ్ళను క్షమించి విడిచి పెట్టడం పాముకు పాలు పోసిపెంచి విడిచి పెట్టినట్లని తరువాత భావించాను.

"తెల్లవారింది.ఊళ్ళోనిసర్కిల్ యిన్స్పెక్టరు,పోలీసులు వచ్చారు. నామీద డబ్బును దొంగిలించినట్లు కల్పిత నేరారోపణ చేయబడ్డది. తిరిగి నా చేతులకు సంకెళ్లు పడిపోయినవి. ఇదే నాకథ బాబు" అని రాము శూన్యంగా కిటికీ గుండా ఆకాశం వంక చూశాడు. అనంతా

కాశంలో తారకలు లేవు. చంద్రుడు లేడు. సూర్యుడు లేడు. వీళ్ళంతా నల్లటి దట్టమైన కారుమబ్బులలో ప్రశాంతంగా నిద్రపోతున్నారు. భయంకరంగా వీచేగాలికి ప్రకృతిలోని చెట్లన్నీ పండుటాకులను రాల్చుతున్నాయి. గాలికి ఆకులు ఒక చోటునుండి మరొక చోటుకు కొట్టుక పోతున్నాయి. ఇలాగే మానవులు పరిస్థితుల తాకిడికి కప్పగంతులు వేస్తారు. ఎగిరెగిరి పడుతూ కూడ ఆశలు చావనీయరు. కాని యిందువల్ల ఎంత నష్టముందో ఎవరికీ తెలియదు. జీవితంలో ఎలాంటి హాలాహలం కలుగజేస్తాయో ఎవరికీ అర్ధంకాదు.'' అని రామువిద్యుద్దీపాల మసక వెలుగులో ప్రకృతిలోని ఈలాంటి దృశ్యాలను చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

రాము విషాద గాధను విన్న రాజేంద్రుని ఆలోచనలు పరిపరి విధాల పోతున్నాయి. ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు అతని స్మృతి పధంలో లక్ష్మి గోచరిస్తున్నది. తన ఊహా పదంలో ప్రకాశించే లక్ష్మి యితని చెల్లెలయితె కాదుగా। ఏమో....? ఈమె రాము చెల్లెలు కాదని ఎట్లా చెప్పగలను? అయితె లక్ష్మి ఇంతకాలం తనకు అన్నయ్య వున్నట్లు ఎన్నడు చెప్పలేదే...। లక్ష్మి తప్పు చేసిందా? అసలు తప్పంటే ఏమిటి? పరిస్థితులే మనలో దౌర్బల్యాన్ని పుట్టించి తప్పులను చేయిస్తుంది. ఇక్కడ తప్పులను యెంచేది ఎవరు? సంఘం? అడుగడుగునా తప్పులెన్నుతూ కూర్చోవటమే దానిపని. తను లక్ష్మిని ప్రేమిస్తున్నాడు. ఆమె తన పట్ల ఎంతో భక్తి శ్రద్ధలు చూపుతుంది. మనసిచ్చి మాట్లాడుతుంది. లక్ష్మి పేదకుటుంబములో పుట్టినా అందంలో రతీదేవిని మించిపోతుంది. మృదువైన ఆమె చెక్కిళ్ళు, ఎట్టిటి పెదవులమధ్య నిరంతరమూ వికసించే చక్కని చిరునవ్వు, ముఖానికి వింత అందాన్ని తెచ్చే నీలికలువరేకుల్లాంటి కన్నులు. విరిసిన మల్లెపూవుల మధుర సువాసనలాంటి ఆమె యౌవనం, తనకు బాగా నచ్చింది....?'' అని ఈవిధంగా

ఊహా ప్రపంచములో విహరిస్తుంటె ఆ గదిలోకి దబాలున తలుపు తీసు కొని కంగారుగా అడుగుపెట్టింది లక్ష్మి.

"మీకోసరము పోలీసులొచ్చారు బాబు!" అంది లక్ష్మి నేరం చేసినట్లుగా భయపడిపోతూ రాజేంద్రునితో. లక్ష్మిని చూడగానే రాము హృదయంలో ఆనందం జలకమాడింది. ముఖం వికసించిన పువ్వులా పరిమళం పొందినది.

"లక్ష్మి.... !" అని రాము ఆనందంతో చిందులు త్రొక్కే కండ్లతో ఆశగా లక్ష్మి ముఖంలోకి చూస్తున్నాడు.

ఇదేవిధంగా లక్ష్మికి కూడ రామును చూడగానే ఆమెహృదయం సంపూర్ణ ఆనందంతో నిండిపోయింది. ఆమెలోని సర్వనయనాలు ఆనందంతో వికసించినవి.

"నీవా అన్నయ్యా !" అని లక్ష్మి రాముదగ్గరకు పోయింది.

"నేనే మీ అన్నయ్యను లక్ష్మి ! నిన్ను క్షమించాను. నీకేమీ భయంలేదు" అని రాము తన చెల్లెలును హృదయానికి హత్తుకున్నాడు. లక్ష్మి పట్టరాని సంతోషంతో ఆనంద బాష్పాలను రాల్చింది. ఇదంతా రాజేంద్రుడు చూసి తోబుట్టువుల మమకారాలు ఎట్లాంటివో అర్థం చేసుకున్నాడు.

"రాము ! ఇక నీ ఆశయం నెరవేరి నట్లేనా? యిక్కడ నీలక్ష్మికి ఏమి భయంలేదు. ఆమెను నాదానిగా చేసుకుంటాను" అన్నాడు రాజేంద్ర.

ఈ మాటలు రాము మనస్సులో తన కర్తవ్యాన్ని గుర్తుకు తెచ్చినవి.

"నా కర్తవ్య మేమిటో నాకు తెలుసు బాబు ! నీలాంటి సహృదయునికి లక్ష్మి ఇల్లాలు కావటం నాకు చాలా సంతోషం.. ఈ సంతో

షంతో మీదాంపత్యం సుఖంగా సాగిపోవాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను. ఇక నేను ప్రభుత్వాన్ని మోసం చేయను. నేనిక ఎక్కడికి పోవాలో అక్కడికే పోతాను....'' అంటూ రాము గదినుంచి బయటపడ్డాడు. ఇదంతా లక్ష్మికి అర్థంకాక నిశ్చేష్టురాలై నిలబడి చూస్తున్నది. మరు క్షణంలో ఆమె అంతా తెలుసుకొని ''అన్నయ్యా....!'' అంటూ వీధిలోకి పరుగెత్తింది. కాని రాము చీకటిలో పోలీసువాండ్ల వెంబడి దూరంగా వెళ్ళిపోయాడు.

"బాబూ! అన్నయ్యను విడిపించరూ?'' అంది లక్ష్మి ఏడ్చుకుంటూ.

''అది నా సాధ్యంకాదు లక్ష్మీ! మీ అన్నయ్య ప్రభుత్వ దృష్టిలో నేరస్తుడు. నేరం చేసినవాడిని శిక్షించటం ప్రభుత్వ కర్తవ్యం'' అని రాజేంద్రుడు లక్ష్మిని తన హృదయానికి గట్టిగా కౌగలించు కొన్నాడు.

''మీ అన్నయ్య చాల మంచివాడు లక్ష్మి! కాని దొంగ. దొంగా ఒక మనిషేనని ఈ లోకం యెప్పుడు తెలుసుకుంటుందో ఏమో......?" అని రాజేంద్రుడు వర్షానికి తడిసిన ఆమె చల్లటి మృదువైన శరీరమూ, మెత్తని శిరోజములు నిమురు తున్నాడు. లక్ష్మి హృదయం యింకా కంగారుతో క్షోభిస్తున్నది. ఆమె కళ్ళల్లో నీళ్లు కారిపోతున్నాయి.



# మంచి ముహూర్తం

అప్పుడు సాయంత్రం ఆరుగంటలు. దినకరుని లేలేత బంగారు కిరణాలతో పచ్చని చెట్లకొనలు మిలమిల లాడిపోతున్నాయి. సుధాకర్ పడక కుర్చీలో కూర్చుని దేనికో నిరీక్షిస్తున్నాడు. కిటికీలోనుంచి వీచే చల్లనిగాలికి అతని మనస్సులో ఎన్నో మధుర మధుర ఆలోచనలు మెదలిపోతున్నాయ్. ఇంతలో "పోస్టు!, అనే శబ్దం బయట వినబడ గానే అతని ఆలోచనలు ఆగిపోయి, మనస్సు ఆత్రుత పడసాగింది. తనమామయ్య ఏమి వ్రాసాడో చూడాలని గబగబావెళ్ళి ఉత్తరం అందు కున్నాడు.

చిరంజీవి సుధాకర్‌కు మీమామ పుత్రపౌత్రాభివృద్ధిగాను దీవించి వ్రాయు విషయాలు.

మేమంతా ఇక్కడ క్షేమము. నీవుకూడా భగవంతుని దయవలన క్షేమంగా వుండవచ్చును. ఇక్కడ నేను వేదమూర్తులైన బ్రాహ్మణులచే మంచి ముహూర్తం నిశ్చయించాను. వచ్చే కార్తీకశుద్ధ త్రియోదశి శుక్రవారమే ఆ శుభదినము. అందుచే నీవు ఒకరోజు ముందుగానే రావలయును. నీరాక కొరకు మేము వేయికండ్లతో ఎదురు చూస్తాము.

ఇట్లు
పరంధామయ్య.

ఈ ఉత్తరం చదువుకోగానే సుధాకర్ పరమానంద భరితుడయి నాడు. పెండ్లయిన చాలరోజులకు తన సుధను చూడటానికి వెళ్ళు తున్నందుకు అతని మనస్సు మురిసిపోతుంది. అంతులో తను అత్తారిం టికి వెళ్ళటం యిదే ప్రధమం. కొత్తగా అల్లుడు వచ్చాడనే సంబరంతో అత్తయ్య మంచి మంచి పిండివంటలు చేస్తుంది. మామయ్య గుమ్మంలో

ఎదురై స్వాగతం చెపుతాడు. బావమరుదులు మాబావ వొచ్చాడు, అంటూ అల్లరిగంతులు వేస్తారు. చిట్టిమరదలు చిలిపిగా నవ్వుకుంటూ కొంటెగా ప్రశ్నలు వేస్తుంది. తనురహస్యంగా సుధతో మాట్లాడటానికి మరదలు సహాయ పడుతుంది. ఇంతకాలానికైనా తన మనస్సులోని మనోవ్యధను తెలుసుకొని ముహూర్తం నిశ్చయించినందుకు మామయ్యను ఎంతైనా అభినందించాలి. ఈ విధంగా సుధాకర్ వుత్తరాన్ని చదువుకొని వూహా ప్రపంచములో తేలియాడుతున్నాడు.

"ఏమిరా బ్రదర్! ఈ రోజుచాల సంతోషంగా వున్నావు. శ్రీమతి దగ్గరనుంచి ఏదైనా ఉత్తరం వచ్చిందా?" సుధాకర్ స్నేహితుడు ప్రకాశం అప్పుడే గదిలోకి వచ్చి నవ్వుకుంటూ అన్నాడు.

"శ్రీమతి దగ్గర నుంచి కాదురా"

"మరి ఎవ్వరి దగ్గరనుంచి"

"మామయ్య నుంచి"

"ఏమని......?"

"రమ్మని...... !"

"అయితే ప్రయాణమెప్పుడూ ?"

"రేపటి మేలుకే"

"కొంచెం జాగ్రత్త బ్రదర్ ! కొత్తల్లుడు వచ్చాడని ఏవేవో ఘనంగా పిండివంటలు చేస్తారు. పుణ్యానికి వచ్చినవికదా అని యెక్కువంగా తినేవు. అజీర్ణం చేస్తుంది," అన్నాడు ప్రకాశం నవ్వుకుంటూ.

"పోరా! నీవేళాకోళం నీవూను" అన్నాడు సుధాకర్ మరింతగా విరగబడి నవ్వుతూ.

సుధాకర్ అత్తగారిల్లు చేరుకోగానే తను వూహించినట్లుగానే

గుమ్మంలో మామయ్య ఎదురై కుశల ప్రశ్నలు వేశాడు. కాళ్ళకు ఆతని మరదలు వరలక్ష్మితో నీళ్లు యిప్పించాడు.

మరునాడు మధ్యాహ్నం భోజనాలయినాక సుధాకర్ తీరికగా గదిలో కూర్చుని ప్రేమ్‌చంద్ నవల "నిర్మల" చదువుతున్నాడు. ఆతనిమనస్సంతా పుస్తకంపైలేదు. రాత్రికి శోభనపుగదిలో తను సుధతో పొందే సౌఖ్యాన్ని గూర్చి కలలు గంటున్నాడు. ఆకాశంలో శరత్కాలపు చంద్రుడు వెలుగుతాడు. పండు వెన్నెల పిండారబోసినట్లుగా వుంటుంది. పాన్పుపై మధుర సువాసనలు యిచ్చే మల్లెపువ్వులుంటాయి. సుధ ఘనంగా ముస్తాబై చిలిపిగా చిరునవ్వు నవ్వుకుంటూవచ్చి సిగ్గుతో నిల బడుతుంది. నాగుపాములాంటి ఆమెవాలు జడను పుచ్చుకొని దగ్గరకు లాగుతాను. సుధ సిగ్గుతో వుక్కిరి బిక్కిరై పోతుంది. జడలో విర సిన మల్లెపూవులను తనవితీరా చిందరవందరగాచేసి ఆమెను తనకౌగిలీ లోకి తీసుకుంటాను. తనకౌగిలిలో సుధ తన్మయత్వం చెంది అర్ధనిమీ లితనేత్రాలతో ఆశగా తనవైపు చూస్తుంది. తనుయింకా ఆమెను దగ్గ రకు లాక్కొని చెక్కిళ్ళపైన ముద్దులవర్షాన్ని కురిపిస్తాను. ఇదంతా అమ్మలక్కలు తలుపు సందుల్లోనుంచి దొంగ దొంగ చూపులు చూస్తారు......అని సుధాకర్ యీవిధంగా ఊహాగానంలో విహరిస్తూ పుస్తకంలోని పేజీలను ఖాళీగా తిరుగవేస్తున్నాడు. తను పుస్తకాన్ని ఎట్లావుంచి చదువుతున్నదీ అతను గమనించటంలేదు.

"ఏం బావా! మీకు చదువు ఎన్నివిధాల చదువ వస్తుంది?" అన్నాడు పదేండ్ల ఖాను పరిహాసంగా.

అప్పుడు సుధాకర్ తన పొరపాటు తెలుసుకొని, తప్పును కప్పి పుచ్చుకోవటానికి "రెండువిధాల చదవ వస్తుందిరా భడవా!" అన్నాడు.

"ఓస్ యింతేనా...! నాకుమూడువిధాల చదువవస్తుంది బావా!" అన్నాడు ఖాను కొంటెగా.

సుధాకర్ తనబావమరిది భాను తెలివికి మెచ్చుకొని, తనప్రశ్న కొన్ని సరిపెట్టుకున్నాడు.

సాయంత్రమయేవరకు సుధాకర్‌కు ముహూర్తం వాయిదాపడినట్లు పిడుగులాంటి వార్త వచ్చింది. అతని గుండెలు నిలువునా నీరైపోయినవి. శోభనపు గదిలో పడక వేస్తుంటే ఎవరో తుమ్మినారట! ఈ అపశకునం మంచిదిగాదని ముహూర్తం మరో మంచి రోజువరకు పొడిగించాడు పరంధామయ్య. సుధాకర్ తన ఆశలు ఫలించుతాయని ఆశగావస్తె నిరాశలై నిశీధుల్లో కలసిపోయినవి. తన దురదృష్టాన్ని తనే నిందించుకొన్నాడు. అతనికి పంచాంగములను, శాస్త్రములను తగులబెట్టాలనే అంతటి కోపం వచ్చింది. మంచి ముహూర్తం నిర్ణయించినప్పుడు ఈ అపశకునం ఎందుకు జరిగింది? దీనికి వేదమూర్తులైన బ్రాహ్మణుల సమాధాన మేమిటి? అపశకునం జరిగినంత మాత్రాన మామయ్య ముహూర్తాన్ని వాయిదా యెందుకు వేయాలి? ఆయన ఒక పాతకాలపు మనిషి. వారికి అడుగడుగునా అన్నీ అపశకునాలే? మనం ఏపని చేసినా మంచిదినాన, మంచి వేళల చేయాలని ఆయన మూర్ఖ నమ్మకం. ఇలాంటి మూర్ఖ నమ్మకాలతోనే నేడుదేశంలో ఎన్నో అభివృద్ధిపనులు కుంటుపడిపోతున్నాయి. సుధాకర్ పరంధామయ్యతో ఏకీభవించడు. కాలచక్రంలో మంచి చెడులు కనిపించవని, మనస్సులు మంచివైతె అన్నిరోజులు మంచివేనని యితని అభిప్రాయం. ఈ నాడు దేశంలో మంచి చెడ్డల్ని గురించిన గుడ్డి నమ్మకాలు విరివిగా వున్నాయి. అష్టమి నవమి దినాలు మంచివి కావనీ, ఆదివారం రోజు ఆడబిడ్డ పుట్టింటి నుంచి పోగూడదనీ, శనివారం రోజు ఏపని చేసినా శని వెంబడిస్తుందనీ, యిత్యాది గుడ్డినమ్మకాలు యింకెన్నో ఉన్నాయి. బాగా ఆలోచిస్తే వీటికి అర్థం ఏమీ కనిపించదు. భూమిచుట్టూ, చంద్రుని చుట్టూ, సూర్యునిచుట్టూ తిరిగే ఉపగ్రహాల తోరణాన్ని నిత్య జీవితంలోని చీకటి వెలుగులకు ముడివేస్తారు. అసలు మన జీవితమే

అనుకోని సంఘటనల అల్లికతో కూడుకున్నది. అందుచే ఎప్పుడు ఏమి జరుగుతుందో ఎవరూ చెప్పలేరు. ఈ విధంగా నిత్యజీవితంలో అనుకోని సంఘటనలు జరిగితే, లేచినవేళ మంచిదికాదనీ, పొద్దున్నే ఎవరిముఖాన్ని చూశామోననీ ఒకరి నొకరు నిందించుకొంటారు. మంచిరోజు చేసే పనులకు ఏదైనా ఆపదవస్తే దురదృష్టం, అదృష్టమనీ యెందుకు నిందించుకోవాలి?

మరునాడు సుధాకర్ అత్తగారిల్లు విడువ లేక విడువ లేక బయలుదేరాడు.

"త్వరలోనే మళ్లీ ముహూర్తం నిశ్చయించుతాను. ఆ కాస్తా కార్యం జరిపించేస్తే నా బరువు తీరుతుంది" అన్నాడు పరంధామయ్య అల్లుడు ప్రయాణమై పోయేటప్పుడు.

"మీయిష్టం మామయ్య" అని సుధాకర్ వెళ్లిపోయాడు.

మరికొన్ని రోజులకు సుధాకర్‌కు మంచి ముహూర్తం నిశ్చయించినట్లు అత్తగారింటినుంచి ఉత్తరం వచ్చింది. ఈ సారి తన కోరిక ఫలించాలనీ కోటి దేముళ్లకు మొక్కుకొని ప్రయాణమయ్యాడు. మళ్లీ తన ఆశలు అగాధాలై అడుగంటిపోయినవి. ఆరోజు సుధకు అకస్మాత్తుగా ఛలిజ్వరం ముంచుకొచ్చింది. ఇంతకీ దేనికైనా అదృష్టం వుండాలి. అదృష్టం వుంటే అన్నిదినాలు మంచివేనని పరంధామయ్యకు ఈ నాడు బాగా తెలిసి వచ్చింది. సుధకు జ్వరం నుంచి కోలుకునేవరకు మూడు రోజులు పట్టింది. ఈ మూడు దినాలు సుధాకర్ అత్తగారింటిలోనే మకాం వేశాడు.

ఆరోజు సాయంత్రం సుధాకర్ డాబామీద అటూయిటూ పచార్లు చేస్తున్నాడు. పున్నమి వెన్నెల విరియ కాస్తున్నది. పెరట్లో పందిరిపై విరిసిన మల్లెపూవులు వెన్నెల వెలుగులో మధుర మధుర సువాసనలతో.

యౌవనుల హృదయాలు ఆనందానుభూతులతో నిండిపోతున్నాయి. చల్లటి చిరుగాలులు వొయ్యారంగా వీస్తున్నాయి. వసంతం వెల్లి విరిసిన ప్రకృతిలో ఏవో మధుర భావనలు సుధాకర్ మనస్సులో మెదలి, మెదలో బాధను కలిగిస్తున్నాయి. అతని తీయటి కలలకు మధ్యన మంచి ముహూర్తం అనంతమైన అఖాతాన్ని కల్పించినది. దీనిలోనే తన ఆశలు పడి చిందర వందరగా చెదరిపోతున్నాయి. యిక ఉపేక్షించితే లాభంలేదు. తను ఈ దురాచారాన్ని ఎదిరించాలి. సుధను తన బాహువుల్లో యిముడ్చుకుని తనివితీరా ఈ రోజే ముద్దు పెట్టుకోవాలి. ఆమె ముగ్ధమోహన లావణ్యాన్ని రుచి చూడాలి. ప్రణయ లోకాలను జయించి యౌవన సామ్రాజ్యంలో విజయ పతాకమును ఎగురవేయాలి. అని సుధాకర్ పరధ్యాన్నంగా ఆలోచించుకుంటూ పచార్లు చేస్తున్నాడు. ఇంతలో సుధ ఏదో పనిమీద అక్కడికి వచ్చింది. భర్తను చూసి సిగ్గుపడి పరుగెత్తిపోయింది. కాని సుధాకర్ ఈ సదవకాశాన్ని జార విడుచుకోవటం మంచిది గాదని, ఆమె వాలు జడను పుచ్చుకొని లాగాడు.

"వదలండీ.... ఎవరైనా వస్తారు..... ?" అంది సుధ.

"ఎవరొస్తే మనకేమి భయం సుధా! పండిన పండుకొరకు యింకెన్నాళ్లు నిరీక్షించాలి?" అని సుధాకర్ ఆమెను తన బాహువుల్లో బంధించి వేశాడు. సుధ జడలోని తెల్లటి మల్లెపూవులు, ఎర్రటి కనకాంబరాలు అతని చేతుల్లో నలిగిపోయి, చిరుగాలులకు చక్కని సువాసనలు విరజిమ్ముతున్నాయి.

కాలచక్రంలో రోజులు, వారాలు, నెలలు గంతులు వేస్తున్నాయి. సంవత్సరం తిరుగక ముందే సుధకు చక్కని కొడుకు పుట్టాడు. ఆమె అదృష్టాన్ని అమ్మలక్కలు వేనోళ్ల కొనియాడారు. పరంధామయ్యకు మనుమడు పుట్టాడనే సంతోషము చెప్పతరముకాదు.

"మామయ్యా! మనుమడు ఏ నక్షత్రాన పుట్టాడో శాస్త్రులవారిని అడిగారా : "అన్నాడు సుధాకర్ పరంధామయ్యను పరిహాసం చేయాలని.

"చెప్పురా మీ నాన్నకు ఇక ఈ పరంధామయ్య మంచి ముహూర్తాల జోలికిపోడని." చిరునవ్వులతో, కేరింతలతో ఆడుకుంటున్న చిట్టి పాపతో పరంధామయ్య చెప్పాడు.

# కలవారియింటి బిడ్డ

శ్రీవారికి నమస్కారములు

మీకు వ్రాయునది ఏమనగా ప్రస్తుతము నేను మనోవ్యాధితో బాధ పడుతున్నాను. మనోవ్యాధికి మందులు లేవనీ డాక్టర్లు అంటారు. రోజులు గడుస్తున్నకొద్దీ నా మనోవ్యధ మరింతగా విజృంభించుతుందే గాని, తగ్గుముఖం పట్టటం లేదు. మనోవ్యధ మానవుడిని ఎంతగా బాధిస్తుందో అనుభవం వలన నాకిప్పుడు బాగా తెలుస్తున్నది. అయినా ఆశలు చావనీయక ప్రతి నిత్యమూ మీరాక కోసరము నేను నిరీక్షించు తూనే వున్నాను. ప్రతిరోజు టపాలో మీదగ్గరనుంచి ఏదైనా జవాబు వస్తుందని యింతకాలం ఎదురు చూశాను. వేళకు పోస్టుమెన్ వస్తాడు. పక్కింటి అమ్మాయిలకు ఉత్తరాలు యిస్తాడు. తిరిగి వెళ్ళిపోతాడు. అందులో ఒక్కటైనా మీ దగ్గరనుంచి రాకూడదాఅని పోస్టుమెను వచ్చి నప్పుడల్లా అనుకుంటాను. తిరిగి నిరాశలు నాలో ఆశలుగా రేకెత్తుతయ్. రేపటికైనా వస్తుందని మనసులో అనుకుంటాను. యీ నైజమే మాన వుని నిరాశామయ లోకంలో నిత్యమూ బ్రతుకుమీద ఆశ పురికొల్పు తుంది. ఇక్కడ మీరు ఒక్కసారి పూర్వ సంఘటనలను సింహా లోకనం చేసుకొనండి. జరిగినదంతా వివరంగా వ్రాస్తాను. మీరు లోతుగా ఆలోచించండి. నేను తప్పుచేశాను క్షమించ మంటున్నాను. క్షమించటం మానవుని కనీస ధర్మం గదా ?

మన స్థితిగతులను బట్టి మన జీవయాత్ర సాగించాలి గానీ, ఏవో దూరతీరాలకై ఆరాటపడటం మానవుని లక్ష్యం కాదనే ఆనాడు మీరు చెప్పినమాట వాస్తవం. జీవితపు లోతుపాతుల్ని అర్థం చేసుకునే యింగిత జ్ఞానం నాలో లేనప్పుడు మీ హితబోధలు నావద్ద ఏమీ పని చేయలేవు.

మీతో తగువులాడుకొని యిక్కడికి వచ్చినప్పటినుంచి నాకేమీ సుఖంలేదు. అమ్మా నాన్న మర్యాదగానే ఆశ్రయ మిచ్చారు. కాని వారి మర్యాదలో అనురాగంలేదు

హిందూస్త్రీకి భర్తయే సర్వస్వమని సంపదలు శాశ్వతం కావనీ.. వాటికోసరం పోట్లాడి మన జీవితాలను నాశనం చేసుకోవటం ధర్మం కాదనీ, "సత్యం, శివం, సుందరం" యివే మానవుని అమూల్య సంపదలనీ, భార్యా భర్తలు అన్న తరువాత జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు అభిప్రాయ భేదాలు రాక తప్పవనీ, యింతమాత్రానికే యిల్లు వాకిలి విడిచిపెట్టి యిలా రావటం భావ్యం కాదని అప్పట్లో నాకు అన్నయ్య చెప్పాడు. ఇదంతా ఆనాడు చెవిటివానిముందు శంఖము వూదినట్లు కూడ నేను లెక్కచేయలేదు. దీనికంతకు కారణం ఒకందుకు మానాన్న ఏమో! ఆనాడు ఆయన నాకు యింట్లో ఆశ్రయ మివ్వక తూలనాడి యుంటె ఇదంతా జరుగకుండునేమో....!! కానీ ఏకన్న తండ్రి యిలా చేయగలడు మీరే చెప్పండి?

నేను చిన్నతనంలోనుంచి సిరిసంపదలతో తేలి యాడటమే నాలో గర్వానికి మూలకారణం. నా జీవితమంతా సర్వసుఖ భోగాలతో సాగిపోవాలని ఆశ పడ్డాను. కాని నేను కన్నకలలకు, తీయటి అనుభూతులకు లంగరు అంటలేదు.

మీరు నమ్మండి నమ్మకపోండి. నాలో యిప్పుడు చాల మార్పు వచ్చిందని మరొకసారి మనవి చేస్తున్నాను. భర్త అనురాగమే స్త్రీ జీవిత లక్ష్యమనీ, పతియే ప్రత్యక్ష దైవమనీ చెప్పిన పురాణాలన్నీ నాకిప్పుడు జ్ఞాపక మొస్తున్నాయి. అసలు యిది మానవుని సహజ గుణమేగా!! కష్టాలలో వున్నప్పుడే కరుణామయుడు జ్ఞాపక మొస్తాడు. ఆశలు సుడిగుండములో చిక్కుకున్నప్పుడే అన్నీ తెలిసి వస్తాయి. దుర్భర

దారిద్ర్య భారంతో జీవితం గడిపినప్పుడే జీవితంలోని చీకటి వెలుగు సరిగా అర్థమౌతుంది.

లోకంలో మర్యాదలన్ని నాకిప్పుడు వివిధ రంగుల్లో అవుపించుతున్నాయి. ఈ లోక మర్యాదలను చూచి లోకం చాల చెడ్డదనుకుంటాను. యిప్పుడు ఎన్ని అనుకున్నా ఏంలాభం ? మొదలే ఈ లోకాన్ని సరిగా అర్థం చేసుకుంటే యీ కష్టాలు కలుగక పోవునేమో ! ప్రవాహంలో పడిన చిన్న గులకరాయి పరిస్థితి యెలా వుంటుందో ఈ లోకాన భర్త విడిచిన స్త్రీ జీవితం కూడ అలాగే వుంటుంది.

మళ్ళీ మిమ్మల్ని ప్రార్థిస్తాను. ఒక్క విషయం ఆలకించండి. మీకంటె నాకు ఆప్తులెవరు ? ఏవో చిన్న తగవులకు మీరే నన్ను నిరసిస్తే నాగతి యెలా చెప్పండి. నలుగురిలో తలవంపులు భరించలేక పోతున్నాను. అభిమానవంతురాలైన ఆడదానికి యింతకంటే యింకేమి శిక్షకావాలో చెప్పండి. నాహృదయద్వారాలను తెరచి మీముందు ఉంచుతున్నాను. మరి మీరు ఆ ద్వారాల్లోనికి అనురాగంతో ప్రవేశిస్తారో లేక దయారహితంగా మూసివేస్తారో ! అదంతా మీ యిష్టం. అనుక్షణం మీ రాక కొరకు నిరీక్షిస్తాను. ఈ దీను రాలిని క్షమించి మీ పాదాల దగ్గర కొద్దిగా స్థానం యివ్వండి.

ఇట్లు,
సు మ తి

యీ వుత్తరం చదివిన రవీందర్ ఆశ్చర్యపోయాడు. నెలరోజుల క్రితము వ్రాసిన ఈ ఉత్తరము ఇన్నాళ్లు ఎక్కడుంది ? యిది పోస్టు వాళ్ళ పొరపాటు అయివుంటుంది. అయితే సుమతి యిప్పుడు ఎట్లా వుందో ? ఎంత బాధపడుతుందో ? తన రాక కొరకు ఎంతగా నిరీక్షించుతుందో ? ఆమెలో మార్పు వచ్చినట్లుగా వుంది. పశ్చాత్తాపం చెందుతున్నట్లుగా వుంది. కాని తనే నిర్లక్ష్యం చేస్తున్నాడు. ఈ విధంగా

ఆలోచింపుతున్న రవీందర్ హృదయాన్ని ఉత్తరంలోని ప్రతి వాక్యం శూలమై హింసించుతోంది. యింతలో "టెలిగ్రామ్" సార్ అను కుంటూ పోస్టుమెన్ వచ్చాడు. టెలిగ్రాంను చూడగానే అతని గుండె ఆగిపోయినట్లైంది. సుమతి తనకు దక్కుతుందా? ఆమెకు ఏ అపాయము కల్గించవద్దని మనస్సులో వేయి దేముళ్ళకు మొక్కుకున్నాడు.

రైలు స్టేషన్‌నుంచి బరువుగా బయలుదేరింది. రవీందర్ తన అర్ధరహితమైన దృష్టిని ఆకాశంలోకి మరలించాడు. వినీలాకాశంలో ప్రకాశిస్తున్న తారకలన్నీ అతని దుస్థితిని చూసి వెక్కిరిస్తున్నట్లుగా వికృతంగా కనిపిస్తున్నాయి. దీనితో ఆనాటి ఎన్నోవిషయాలు అతని స్మృతి పధంలో మెరసిపోతున్నాయి.

ఇదంతా ఒక సంవత్సరము క్రితము సంగతి....! రవీందర్‌కు సుమతితో పెండ్లిజగి యిప్పటికి రెండు సంవత్సరములు కావస్తోంది. ఆమె తను ఏరికోరి తెచ్చుకొన్న సౌందర్యరాశియే. పసిడివర్ణంతో కళకళలాడే ఆమె శరీరం, అందమైన కోల ముఖం, నీలాలులాంటి ఆకర్షణీయమైన పెద్ద కళ్ళతో, పెదవులపైన చక్కని చిరునవ్వుతో సుమతి ఎంతో అందంగా వుంటుంది.

సుమతికి రవీందర్‌తో పరిచయం కాలేజీలో చదువుతుండగా జరిగింది అతనితో స్నేహం చేసుకొని మనసిచ్చి ప్రేమించింది. అందమైన అతని ముఖము, చక్కని శరీరచ్ఛాయ సుమతిని బాగా ఆకర్షించాయి. ఆమె చదివిన నవల్సులో కానవచ్చే సుందర వ్యక్తిగా, ఆమె వూహించిన ఆదర్శ వ్యక్తిగా రవీందర్ ఆమెకు కనిపించాడు. సుమతి తన కోరికను తండ్రికి చెప్పింది. శీతారామయ్య తన ముద్దుల కుమార్తె మాటను కాదనలేక పోయాడు.

మన స్థితిగతులను బట్టి జీవితానికి పునాదులు వేసుకోవాలి. కాని

జీవితాన్ని స్వర్గమయంగా చిత్రించుకొని, అలా జరగకపోతే తమభర్తల మీద కోపం చేయటం వృత్త తెలివితక్కువ తనము. ఇక్కడ సుమతి కూడ ఇలాంటి అభిప్రాయాలు గలదే. యిక్కడ ఒక్క సుమతియే కాదు.... నేడు కలవారి యింటిబిడ్డలు చాలవరకు ఇలాగే బ్రతుక చూస్తారు. తాము అనుకున్న గొంతెమ్మ కోరికలు నెరవేరక పోయే టప్పటికి తమ భర్తలు ప్రయోజకులు కారనీ, యీనరకకూపంలో ఎందుకు పచ్చిపడ్డామానీ, మంచిగా సిరిసంపదలు గలిగిన భర్తలు దొరికి వుంటే ఎంతమంచిగా వుండుననీ, యీలాంటి ఏవోఏవో మానసిక ఆరాటాలతో బాధపడుతుంటారు. ఇలాంటి వారిలో కొంతమంది తమ మనస్సుల్లోని ఆందోళన తీరేందుకై రకరకాల తప్పులు చేస్తారు. చివరికి పశ్చాత్తాపం చెంది ఆత్మహత్యలకు పూనుకుంటారు.

సుమతిలో ఇలాంటి గుణాలను చూసి రవీందర్‌కు ఆమెమీద జాలి, సానుభూతి కల్గింది. ఆమెలోని దుర్గుణాలను దూరం చేయటానికి ప్రయత్నం చేసాడు. కాని యితని ప్రయత్నాలు ఆమెపై అంతగా పని చేయలేదు. తను ఆమెను ఎంతగానో ప్రేమిస్తుంటే అంతగా ఆమె తన మీద అధికారం చెలాయించటానికి చూస్తున్నది. తను ఆమెకు లొంగ కూడదు. అలాచేస్తే తన పరువు, మర్యాదలకు భంగం కలుగు తుందని రవీందర్ తలిచాడు.

నిజంగా రవీందర్ చాలమంచివాడు. యితడు అంత ధన వంతుడుకాడు. అందుకే జీవితావసరాలనిమించి ఖర్చు చేయటానికి అలవాటుపడ్డ సుమతికి యితను సంతృప్తి నివ్వలేదు.

యీవిధంగా సుమతి ఆశించిన ఆనందం పొందలేక పోయింది రవీందరువద్ద. ఆమె కన్న కలలన్నీ దారంలేని గాలిపడగలా మారింది. జీవితాన్ని స్వప్న జగత్తులో కన్నకలలులాగా చేయాలని ఆశపడ్డది. తీరని ఆశాభంగం చెందింది. ఆశలు, ఆశయాలు అడుగంటిపోయినవి.

తనకేం లోటు. కావలసినంత ఆస్తి తన తండ్రివద్దవుంది. తగిన అందంకూడ తనలో వుందని సుమతి చాలా గర్వపడ్డది. తనను. రవీందర్ ఎందుకిలా నిర్లక్ష్యం చేస్తాడు. భార్య అంటే పురుషునికి. బానిసకాదు. అందరితోబాటు స్త్రీ కూడా స్వేచ్ఛావిలాసిని. స్వాతంత్రం సమానత్వం ఆమె జన్మహక్కులు. స్త్రీకి తగిన గౌరవమీయని పురుషునితో కాపురం చేయటం తెలివితక్కువ తనమని సుమతి అభిప్రాయ. పడ్డది.

రైలు శరవేగంతో చీకటిని చీల్చుకుంటూ ముందుకు పోతున్నది. రవీందర్ బుర్రలో మెదలిపోతున్న ఎన్నోవిషయాలకు గమ్యస్థానం. లేకుండావుంది. అతనిహృదయం అత్తవారిల్లు చేరుకోవటానికి ఆరాట పడుతోంది. నేత్రాలు సుమతి సందర్శనం కోసరం తహతహ లాడుతున్నాయ్. ఆమెయందు ఇంతకాలం తను చూపిన నిర్లక్ష్యం జ్ఞాపక మొస్తుంటే ఆతని హృదయం బ్రద్దలౌతోంది. దీనికంతకి కారణం?. సుమతియే, మొదలు వచ్చి తన కాళ్ళమీద పడ్డప్పుడే క్షమించటం జరుగుతుందని, రవీందర్ యింతకాలం ఆలస్యం చేశాడు. యింతలో రైలు. ఆగిన ఊపునకు రవీందర్ ఆలోచనలు ఆగిపోయినవి.

సుమతి మెట్టినింటినుండి పుట్టింటికివచ్చిన తరువాత జరిగిన. కొన్నివిషయాలను గురించి తెలుసుకుందాం. ఆమెకు కొన్నిరోజులు. పుట్టింటిలో ప్రశాంతంగానే గడచిపోయినవి. జీవితంలో కాలమంతా. ఒకే రీతిగా వుండదు. అనుక్షణము మార్పులు జరుగుతూనేవుంటాయి. ఇంతవరకు పుట్టింటిలో హాయిగా జీవితం గడుపుతున్న సుమతి. జీవితానికి ఆకస్మాత్తుగా మబ్బుతెరలు అడ్డ మొచ్చాయి. అనుకోకుండా శీతారామయ్య కుటుంబానికి కొన్ని అవాంతరాలు వచ్చి పడ్డాయి. శీతారామయ్య పెద్దకలప వ్యాపారి. యితని వ్యాపారం. మూడులక్షల వరకు సాగుతుందని లోకం వాడుక. దురదృష్టవశాత్తు.

అగ్నిప్రమాదం సంభవించి వ్యాపారంలో పెద్ద నష్టం వచ్చింది. ఈ విచారంతో శీతారామయ్య మంచంపట్టి మరణించాడు. ఇతను మరణించి నప్పుడు రవీందర్ అధమం చూడటానికైనారాలేదు. ఇదంతా తనకేమీ సంబంధం లేదన్నట్లుగా వూరుకున్నాడు. లోకం యీ విషయాన్ని వింతగా చెప్పుకున్నారు. తలకొక విధంగా సుమతిని నిందించారు. ఇదే ఆమెలో గొప్పమార్పును తెచ్చింది. తను ఎంతో పొరపాటు చేసింది. తనజీవితం ఇల్లాంటి విషమ పరిస్థితులను ఎదుర్కొంటుందని సుమతి ఎన్నడు అనుకోలేదు. ఇదంతా ఆమెకు అగమ్యగోచరంగా కనిపించినది. ఏదో విచారంలో ఎప్పుడు దీర్ఘంగా ఆలోచిస్తుంది. రోజులు గడుస్తున్న కొద్ది సుమతికి వంటరితనం వెన్నంటి బాధపెట్టసాగింది. ఇదేవిచారంలో ఆమె ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. కొన్ని దినాలకు సుమతికి విచిత్రమైన రోగంవచ్చింది. కన్నుతెరపకుండా మూడురోజులపాటు విపరీతమైన జ్వరంలో పడింది. మూడవనాడు ఆమె కుడికాలుకు పెద్ద కురుపు ఎగిరింది. వూళ్లోవున్న నాటువైద్యుడు తనకు తెలిసిన మందు యిచ్చాడు. కాని లాభంలేకపోయింది. ఆకురుపు పెద్ద రణంగా మారి ఆమెను చాల బాధిస్తోంది.

"ఎవరికర్మకు ఎవరు బాధ్యులు" అంది లోకం.

"తగిన ప్రతిఫలం అనుభవిస్తుందిలే!" అని అమ్మలక్కలు కూసారు. ఈమాటలువిని సుమతి చాల బాధపడింది. మృత్యుముఖంలో వున్నప్పుడుకూడ లోకం నిందించటానికి వెనుదీయదని ఆమెకు ఈనాడు బాగా తెలిసొచ్చింది. తన దుస్థితిని గురించి తనే నిందించుకుంది. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకుంటె ఏంలాభం?

రవీందర్ బండిదిగి మదనాపురం చేరుకునేవరకు తూర్పు కొండలో అరుణోదయ మౌతోంది. మంచంమీద నిర్జీవిగా పడివున్న

సుమతిని చూడగానే అతని హృదయంలోని దుఃఖసముద్రం కట్టలు త్రెంచుకుంది.

"సుమతీ! నేను వచ్చాను. ఎలావుంది?" రవీందర్ ఆమె ప్రక్కన కూర్చొని పరీక్షగా ముఖంలోకి చూస్తూ అన్నాడు. ఆమె ముఖంలో నిరాశ, దీనత్వం స్పష్టంగా కనపడుతున్నాయి. కన్నుల్లో నుంచి జారిన కన్నీటి చారలు ఆమెచెక్కిళ్లమీద అంట్లు గట్టిపోయినవి.

సుమతి బరువైన హృదయంతో బాధగా కనురెప్పలేస్తూ దీనంగా భర్తముఖంకేసి చూసింది. కాని ఏమి మాట్లాడలేదు.

"యింకేముంది బాబు! నాతల్లి బ్రతికే ఆశలులేవు" అంది సుమతి తల్లి అనసూయమ్మ ఏడ్చుకుంటూ.

"భయపడకు అత్తయ్యా! దైవం మనకు వ్యతిరేకమైనప్పుడు అనుకోని సంఘటనలు జరుగుతుంటవి" అని రవీందర్ ఆమెకు ధైర్యం చెప్పాడు.

"ఏమో నాయనా! నాకేమీ అర్థంకావటంలేదు. అంతా అగమ్యగోచరంగా వుంది. మురళి పట్నండాక్టర్ కొరకువెళ్లి యింకారాలేదు" అంది అనసూయమ్మ జాలిగా ముఖంపెట్టి.

మరునాడు పట్నంనుంచి పెద్దడాక్టరువచ్చి సుమతికి సెప్టిక్ అయిందని చెప్పాడు. అది బాగా ముదిరిపోయిందని, ఆపరేషన్ చేసి కాలు సాంతం తీసివేయకపోతే శరీరమంతా విషపూరితమై, ఆమె ప్రాణానికే ముప్పు తెస్తుందని చెప్పాడు. అందరు ఒప్పుకున్నారు. తన ఆశాజ్యోతి బ్రతికి బయటపడితె తనకదే పదివేలని తలచి రవీందర్ కూడ ఒప్పుకున్నాడు.

రోజులు వారాలు దొర్లిపోతున్నాయి. సుమతి మృత్యుముఖంలో

నుంచి తప్పించుకొని బయటపడేవరకు మాసంరోజులు పట్టింది. రెండు కట్టెల సహాయంతో యింట్లో అటూ యిటూ తిరుగుతుంది.

"నన్నెందుకు బ్రతికించాడో నాకే అర్థం కాకుండావుంది రవీందర్" అంది సుమతి శూన్యంగా ఆకాశంలోకి చూస్తూ.

"అవేమి మాటలు సుమతీ! చీకటిపోగానే వెన్నెల వస్తుంది. వెన్నెలపోగానే చీకట వస్తుంది. ఇదంతా ఆసర్వేశ్వరుడిలీల. అధైర్య పడవద్దు"

"నా జీవితంలో ఇకవెన్నెల ఆశేలేదు. నాతో మీరేమాత్రం సౌఖ్యంపొందలేరు" అంది సుమతి బాధగా నిట్టూర్పుచెంది.

"యిప్పుడే నీవద్ద నిజమైన ఆనందాన్ని సౌఖ్యాన్ని పొందుతాను సుమతీ! నీలోని భౌతిక సౌందర్యం నశించిపోయి, అంతర్నేత్రములు తెరుచుకొన్నవి. ధనము, సౌందర్యము అశాశ్వతమని తెలుసుకొన్నావు. నీలోని గర్వాహంకారాలు నశించి పవిత్రమైపోయింది నీహృదయం. ఇంతకంటె నాకు యింకేమి కావాలి సుమతీ! నాజీవితం యెల్లప్పుడు నీ కోసరం అంకితం చేస్తాను. కాని నిన్ను దూరంచేసుకోను. నీవు నా హృదయేశ్వరివి" అని రవీందర్ ఆమెచేతులను చేతుల్లోకి తీసుకొన్నాడు.

ఈమాటలు వినగానే సుమతి కండ్లు ఆశగా మెరిసాయి. అప్పుడే తూర్పున చంద్రోదయమౌతోంది. పెరట్లో పొన్నచెట్లు, మల్లెపొదలనుంచి చల్లగవీచే పిల్లగాలులు మధుర సువాసనలు కొనితెస్తున్నాయి. దూరాన చకోరపక్షులు కలకలారవములు చేస్తున్నాయి.



# భగ్న హృదయం

ఈ జీవితమే విశాల మహాసముద్రం. ఈ సముద్రములో ఎటు చూచినా శూన్యం. అంధకారమే మన ఈ జీవితానికి సమాధానం. ఈ అంధకారంలో ఎటుచూసినా భయం భ్రాంతి, ఆకలి, చీకటి, పాపాలే! యిక్కడ అమాయకులకు ఆకలిమంటలు. స్వార్థపరులకు సుఖభోగాలు. ఇదంతా ఏమిటి? ఏమిటి చావు? ఎందుకంత నిర్భయం? ఈ నిర్భయమే మానవుణ్ణి అధఃపాతాళంలోకి దింపుతుంది. ఈ పాతాళంలో బ్రతుక నేర్చినవాళ్ళు కావాలి. వీళ్ళకే జీవితములో సుఖభోగాలుంటాయి. సుఖమయమైన జీవితానికి ఎన్నో అక్రమ మార్గాలు అవలంబించవలసి వస్తుంది. పాపమార్గాలు అవలంబిస్తేనే మానవుడు ఈ ప్రపంచములో గొప్పస్థితిలో వుంటాడు. అని ఈ విధంగా మూర్తి శివాలయంలోని మండపం మెట్లమీద కూర్చుని వేదాంతిలా ఆలోచిస్తున్నాడు. అప్పుడప్పుడే భానుడు పశ్చిమ దిశాంతమున విశ్రమించటానికి దిగజారి పోతున్నాడు. తన సహచరుని వియోగానికి పశ్చిమాకాశం విచారంతో స్వాగతం చెప్పుతున్నది. ఆహారానికి అడవికిపోయిన పక్షులన్నీ తమ తమ నెలవులకు చేరుకుంటున్నాయి. తూర్పు ఆకాశంలో ఉదయిస్తున్న చంద్రుణ్ణి చూసి ప్రకృతి సిగ్గుతో తలవంచుకుంది. మలయ మారుతాలు మధురాతి మధురాలై వీస్తున్నాయి. దగ్గరలోనే వికసించిన మల్లె, మొల్ల, కనకాంబరాలు మధుర సువాసనలు వెదజల్లుతున్నాయి. మూర్తి ప్రకృతిలో యిలాంటి కమనీయ దృశ్యాలను చూస్తూ బాధపడుతున్నాడు. అతిమనోహరమైన ఈ వసంతకాలపు వెన్నెలరాత్రి అతనికేమాత్రం ఆనందమీయటం లేదు.

ప్రకృతంతా వెన్నెలను తొలగించుకొని మబ్బుతెరను ధరించు

కుంటూంది. ఆకాశంలో నల్లని మబ్బులు దగ్గరదగ్గరగా చేరుకుం టున్నాయి.

మూర్తి హృదయాంతరాళాలన్నీ సాంద్రాంధకారంతో నిండి పోయినవి.

సంక్షోభపు సుడిగుండంలో బడి తేలియాడుతున్న ఆతని జీవిత నౌక కాలప్రవాహపు అతీత శక్తుల్ని తట్టుకోలేక పోయింది.

గాలికి శివాలయంలోని దీపం రెపరెపలాడుతోంది. భయంకర మైన గాలికి ఆలయంలోని దీపం ఆరిపోకుండా పూజారి విశ్వప్రయ త్నాలు చేస్తున్నాడు. చాలవరకు అతని ప్రయత్నాలు ఫలించాయని చెప్పవచ్చు.

కానీ మూర్తిహృదయంలో ప్రవేశించిన పెనుతుఫాను యింకా వెలుగును వెంటాడుతూనే వుంది. తీరాన్ని చేరుకోకముందే అతని జీవితాన్ని గంగపాలు చేసింది.

''బాబు!'' అనిపిలిచిన గొంతుక మూర్తి నీలోకంలోకి తీసు కొచ్చింది.

మూర్తి తలయెత్తి చూశాడు. అతనికి ఎదురుగా పూజారి నిల బడి వున్నాడు.

"ఎవరు నాయినా నీవు? ఇంతరాత్రివరకు యిక్కడ ఏమి చేస్తున్నావు?" పూజారి అడిగాడు

"నేనొక అభాగ్యుణ్ణి బాబా! సాయంసమయ విహారార్థమైవచ్చి కాల చక్రాన్ని మరచిపోయాను" అన్నాడు మూర్తి బాధగా, లేతగా నవ్వుకుంటూ.

ఆ నవ్వులో అతని హృదయాన కరుడుగట్టిపోయిన బాధను పరిస్ఫుటంగా చూడగలిగాడు పూజారి.

"నీ హృదయంలో ఏదో నిప్పు రగులుతున్నట్లుంది కదూ నాయినా!" అని పూజారి ప్రశ్నించి సమాధానంకొరకు చూస్తున్నాడు.

"అవును బాబా!" అన్నాడు జాలిగా మూర్తి.

ఈ విశాల ప్రపంచములో దుఃఖపడని జీవియుండదు. సుఖ-దుఃఖాలు రెండు ప్రతిమానవుని జీవితంలో దాగి దోబూచులాడుతాయి. దీనికంతకి మనలో రేకెత్తే కోరికలే మూలకారణం. మనం కోరికలను చంపుకోనంతకాలం ఆశాపాశాలు, భ్రమలు, ఎండ మావులు నిత్యం జీవితంలో నీడల్లా వెంటాడుతూనే వుంటాయి.

ఈ మాటలు వినగానే మూర్తిహృదయం కొంతవరకు తేలిక పడింది. అపూర్వ దివ్యజ్యోతి అతని చుట్టూ ఆవరించిన మసక చీకట్లను దూరం చేస్తుంది. ప్రకృతంతా శీతాంశుని వెన్నెలవెలుగులో స్వేచ్ఛా విహారం చేస్తున్నది. ఆకాశంలో నక్షత్రాలు నీరసంగా వెలుగుతున్నాయి. యింతవరకు భీకరవిలయ నృత్యం చేసిన మబ్బులు అంతరిక్షములో దూదిపింజలు లాగా దూరదూరంగా చెదరి పోతున్నాయి.

"నీ విచారానికి కారణమేమిటి నాయినా!"

"ఎవరి సుందర వదనారవింద మధువునై తె నేను కాంక్షించానో ఏకైమ్మోవికై నేను తీయటి కలలుగన్నానో, ఆ ఆశాజ్యోతిని ఆర్పివేసి, ఊహాలతను మూలచ్ఛేదం చేసి నన్ను నడిసముద్రములో ముంచివేసిందీ లోకం బాబా!" అన్నాడు మూర్తి అశ్రుధారలు కుమ్మరిస్తూ.

"నీవొక భగ్నహృదయుడివా? మనం జీవితంలో ఎన్నో ఆశయాలను, ఆదర్శాలను నిర్మించుకొంటాం. మానవుని నిర్ణయాలు భగవన్నిర్ణయాలముందు ఎందుకూ పనికిరావు. విధి వ్యతిరేకమైనప్పుడు విజయం లభించదు"

"విధి మాకు వ్యతిరేకం కాలేదు. స్వార్థపరులైన సమాజ పెద్దలు

నా జీవితలతను తెంచి పారవేశారు. శిష్ట రక్షణ, దుష్టసంహారణ చేసే పరమాత్ముడు ఎప్పటికి యిలా చేయడని నాకు గట్టి నమ్మకముంది బాబా!"

అప్పటికి రాత్రి నాల్గు గంటలు కావస్తోంది. వాతావరణం రమణీయంగా వుంది. సముద్ర తీరాలనుంచి వీస్తున్నగాలి చల్లగా వుంది. మూర్తి తన జీవితంలో జరిగిపోయిన కథను పూజారి దగ్గర మననం చేస్తున్నాడు.

.... యౌవనపు తొలిరోజులలో, భావి జీవిత పందిరికి మల్లెలు తొడిగేకాలంలో మూర్తి భారతితో స్నేహం చేసుకున్నాడు. యౌవన దశలో మానవునికి మధుర మధుర సన్నివేశాలే జీవిత పరమానందం. అలాగే వాళ్ళు నదీ తీరాలలో, పండు వెన్నెలలో తీయటి కలలుగంటూ ఆనంద డోలికలలో తేలియాడుతూ ఆటపాటలతో కాలం గడపారు. అనురాగంతో, అభిమానంతో నిండిన వారి స్నేహం ప్రేమగా మారింది. ప్రేమ పరస్పరానురాగంతో ఫలించటానికి కలలుగన్నది. తమ ప్రేమ మందిరములో వెన్నెలను వెల్గించమని నెలరాజును ప్రార్థించారు. యింతకీ భారతి ఎవరో చెప్పటం మరిచాను. ఆమె మూర్తి మేనమామ కూతురు. పుట్టుకతోనే ఆమె తల్లిపోయింది. కొంత కాలానికి ఆమె తండ్రి కూడ మరణించాడు. అందుచే ఆమెకు ఎవరూ దక్షత లేకపోవటంచే మేనమామగారి యింట్లో పెరిగి పెద్దదైంది. వీధి బడిలో అ ఆ, ఇ ఈ లు మొదలుకొని స్కూల్ఫైనల్ వరకు యిద్దరు ఒకే స్కూల్లో చదువుకొన్నారు. వారి ప్రేమకు యిదొక ముఖ్యకారణమని చెప్పవచ్చు.

భాస్కరుని కిరణాలకు పద్మములు వికసించినట్లుగా మూర్తి భారతిని చూడగానే మైమరచిపోతాడు.

భారతి మంచి అందకత్తె. అప్పుడే వికసించిన గులాబి పువ్వులాంటి ఆమె యౌవనం, నక్షత్రాలవలె తళతళ మెరిసే ఆమె కన్నులు,

చామన చాయతో కళకళలాడే ఆమె శరీరం, దివ్య లోకాలను మరిపించే నయనాలు మూర్తిని బాగా ఆకర్షించినవి.

ఆమె అపూర్వ దివ్యజ్యోతులను తన హృదయంలో వెల్గించుకోవటానికి తహతహలాడి పోయాడు మూర్తి.

మానవుని జీవితంలో ప్రతి నిత్యమూ ఎన్నో అనుకోని సంఘటనలు జరుగుతుంటాయి. కొన్నిటిచే మనం ఆనందానుభూతుల్ని పొందవచ్చు. మరికొన్నిటిచే దుఃఖభాజనం చెందవచ్చు. గడిచిపోయిన అనుభూతుల్ని మరచిపోలేము. అనుభవించిన దుఃఖాల్ని దూరం చేయలేము.

ఇదేవిధంగా మూర్తిజీవితంలో జరిగిపోయిన మధుర సంఘటనను మననం చేదాం.

ఆకాశం తన నీలాలకురుల్లో చామంతి పూవును దాల్చింది. అది శరద్రాత్రి కాబట్టి పండు వెన్నెల పిండార బోసినట్లుగా వుంది. ఆపండు వెన్నెల్లో, ఆహ్లాదం గొలిపే ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ మూర్తి తన గదిలో కూర్చున్నాడు. యింతలో "బావా!" అనుకుంటూ అక్కడికి ఒయ్యారం వొలుక బోసుకుంటూ, నవనాగరిక యువతిలా అలంకరించుకొని భారతి ప్రత్యక్షమైనది. శరత్కాలపు వెన్నెల కాంతులకు ఆమె కన్నులు అపూర్వ కాంతిలో మెరసిపోతున్నాయ్. ఆమె జడలో ధరించిన జాజిపూవుల దండ ఆమె అందానికి వింత సోయగం కూరుస్తున్నాయి. మూర్తి ఆక్షణంలో ఆమె సౌందర్యానికి ముగ్ధుడై వింతగా ఆమె ముఖంలోకి చూస్తున్నాడు.

"ఏమిటి బావా! అలా చూస్తావు?" అంది భారతి అతని వింత చూపులకు చిలిపిగా నవ్వుకుంటూ.

ఆమె పెదవులపై వికసించిన చిరునవ్వు గాలికి దూదిపింజల్లా చీలిచీలి చెదరిపోతున్నాయి.

"ఒక అందమైన పుష్పాన్ని చూడటానికి అధికారం లేదా భారతి!" అన్నాడు మూర్తి నవ్వుకుంటూ.

''ఆనందం అనుభవించటానికి మన మీ ప్రపంచములో జన్మించి నపుడు, అందమైన పుష్పాన్ని చూడటానికి అధికారం లేదని ఎవరంటారు బావా? కాని ప్రతి పుష్పాన్ని వాసన చూడటానికి మాత్రం అధికారం లేదు.''

"మరి నా అందాలపుష్పాన్ని వాసనచూడటానికి అధికారముందా?"

"వుంది''

"ఇప్పుడేనా?"

"కాదు...."

"మరి ఎప్పుడు?"

''మూడు ముళ్ళు పడ్డప్పుడు"

''అంతవరకు ఆశలు నిరాశలేనా?''

"అవును. సీత, అహల్య, అనసూయ, సుమతి మొదలగు పతివ్రతలు జన్మించిన భారత భూమిలో స్త్రీ తన శీలాన్ని ప్రధానంగా కాపాడుకోవాలి. స్త్రీ వివాహం కాకముందు తెలియక తప్పటడుగు వేస్తే సమాజం ఆమెను కఠినంగా శిక్షిస్తుంది. సమాజ కట్టుబాట్లను తృణీకరించిన స్త్రీ జీవితం యీ దేశంలో వ్యర్థం" అంది భారతి.

''అంతవరకు సుందరమైన స్వప్నాలను స్మృతి పథంలో భద్రపర్చుకొని కాలచక్రాన్ని లెక్కిస్తూ కూర్చోవలసిందేనా భారతి!'' అంటూ మూర్తి ఆమెను దగ్గరకు లాక్కొన్నాడు.

"అవును బావా!" అని భారతి ఆతని వడిలో పడుకుని గగన వీధిలో తారకలతో దోబూచు లాడుతున్న చందమామను చూస్తోంది.

ఆనాటి ఈ మధుర సంఘటనను మూర్తి యిప్పటికీ మరచిపోలేక పోతున్నాడు.

యిక్కడ మూర్తి కుటుంబ చరిత్ర సంగ్రహంగా తెలుసుకుందాం. మూర్తి తండ్రిపేరు రామశాస్త్రి. ఆతనికి యిద్దరు కొడుకులు. పెద్దవాడు కృష్ణ. నిజాం కళాశాలలో ఎమ్.ఎ చదువుకొని యింటివద్దనే వ్యవసాయపు పనుల్లో తండ్రికి తోడ్పడుతున్నాడు. ఇక చిన్నవాడు మూర్తి. రామశాస్త్రి ముద్దుల కొడుకు. అసలు రామశాస్త్రి స్వస్థలం వాల్తేరు. కాని యిప్పుడు వాల్తేరుకు సమీపంలో పెద్ద మేడకట్టి అక్కడే వుంటున్నాడు. ఆవూళ్ళో ఆతనిదే పెద్ద వ్యవసాయము. వారితోపాటు వున్న భారతిని రామశాస్త్రి భార్య అలివేలమ్మ కన్నకూతురు కంటె ఎక్కువగా చూసుకునేది. ఆమెను ఏవిధంగానైనా మూర్తికిచ్చి పెండ్లి చేయాలని అలివేలమ్మ అభిప్రాయం. తరుచూ యిదే విషయాన్ని ఆమె భర్తతో అంటుండేది.

ఈ ప్రపంచములో మానవుడు దేనినైతే ఎక్కువగా ప్రేమిస్తాడో అదే అతనికి ఒకనాడు తప్పక దూరమౌతుందనే సత్యాన్ని మూర్తి అనుభవంలో బాగా తెలుసుకొన్నాడు. తన జీవితం యిలా పరిణమించగలదని అతను కలలో నైనా ఊహించలేదు. తన దృక్పథానికి యింతటి తీవ్ర విఘాతం సంభవించగలదని అతను ఎన్నడూ అనుకోలేదు. మూర్తి హైద్రాబాదులో కాలేజీచదువు చదువుతుండగా అతని కుటుంబానికి కొన్ని అవాంతరాలు వచ్చాయి. రామశాస్త్రి భార్య అకస్మాత్తుగా గుండె జబ్బుతో మరణించినది. అతను మరోపెండ్లి చేసుకున్నాడు. లోకంలో సవతి తల్లికి మారుకొడుకులపై ప్రేమ ఎలాంటిదో మనకు విశదమే! భారతిని మూర్తికిచ్చి పెండ్లి చేయమని చెప్పిన భార్య తుదికోరికను మరచిపోయాడు రామశాస్త్రి. భారతిని దురదృష్ట దేవత ఆవరించినది కాబోలు ఆమెను ఒక క్షయరోగికిచ్చి

పెండ్లిచేశాడు. మంచి సంబంధం కావాలంటే వేల కట్నాలు కావలసి వస్తుందని రామశాస్త్రి ఈ పని చేశాడని చెప్పవచ్చు.

భారతి యీ పెండ్లికి అసలే సమ్మతింపలేదు. బలవంతము మీద ఒప్పుకొన్నది. పాపం! ఆమె ఎంతో ఏడ్చింది. కాని ప్రయోజనం లేకపోయింది. ఆమె ఆశలు నిరాశలయ్యాయి. మూర్తికీసంగతి పట్నం నుంచి యింటికి వచ్చేటంతవరకు తెలియదు. భారతి యింకా తనదేనని ఎన్నోకలలు గంటున్నాడు. తొలిసారిగా తన జీవితంలోని విషాద సంఘటనను యింకా మరచిపోలేక పోతున్నాడు.

భారతి తనగదిలో కూర్చుని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ శూన్యాకాశంలో చూస్తోంది. ఆకాశంలో తొలకరి మబ్బుల చాటున తొంగి చూస్తున్న నక్షత్రాలు ఆమె నిరాశా చూపులకు చిత్రవిచిత్రంగా నవ్వుతున్నాయి.

"భారతీ!" అంటూ మూర్తి ఆమెగదిలోకి అడుగు పెట్టగానే భారతి దెబ్బతిన్న లేడిలా బెదురుతూ అతనివేపు చూసింది. నిస్సహాయురాలిగా తలవంచుకొని మౌనంగా నిలబడ్డ భారతిని చూసి మూర్తి ఆశ్చర్యపోయాడు.

"ఏమిటలా వున్నావు భారతి?" అన్నాడు మూర్తి.

భారతి ఏమీ మాట్లాడలేదు. ఆమె తన నిస్సహాయతను కన్నుల్లో కన్నీరు రాల్చి చెప్పుతోంది.

"భారతి సంగతేమిటి? చెప్పవా?" అని మూర్తి ఆమెచెయ్యి పట్టుకొన్నాడు.

"నేను వివాహితను బావా!" అంది ఏడ్చుకుంటూ.

మూర్తి హృదయం, ఒక్కసారి ఆగి వేగంగా కొట్టుకోవటం మొదలుపెట్టింది. ఇదంతాఅతనికి ఒకస్వప్నంగాఅగుపించింది. నిద్రిస్తున్న

ప్రపంచమంతా ఒక్కసారిగా లేచి హేళన చేస్తున్నట్లనిపించింది. అతని రక్తనాళాల్లో రక్తం వురకలు తీస్తోంది. హృదయాంబుధిలో రేగిన అలలు అతన్ని కలవర పరిచినాయి. ఇదంతా భారతి గ్రహించినది కాబోలు "నన్ను మరచిపోజావా!" అంది మెల్లగా

"ఎట్లా మరచిపొమ్మంటావు భారతి!" అన్నాడు మూర్తి వణకుతున్న పెదవులతో.

"మరేం చేస్తాము బావా! ఆశలు నెరవేరనప్పుడు ఆవేదనను అణచుకోవాలి" అంది.

"ఆ నిగ్రహశక్తి నాలో లేదు భారతి! నా ఊహా సుందరివి నీవే! నానుండి నీవు దూరం కాలేవు. ఎవరు విడదీయలేరు." అని ఆమె చేతులను తన చేతుల్లోకి తీసుకొని హృదయానికి గట్టిగా హత్తుకున్నాడు మూర్తి.

ఆ క్షణంలో భారతి ఆవేశానికి అంతులేదు. అణచుకోలేని కోపంతో చేతులను లాక్కొని "నీ జీవితంలో ఆశలు నెరవేరలేదని యితరుల జీవితాలను నాశనం చేస్తావా?" అని చెళ్లుమని అతని చెంప మీద కొట్టింది. ఆదెబ్బకు మూర్తి మనస్సు కరగిపోయింది.

"భారతి! నీ యీ నిరుపమానమైన బుద్ధి నాలో మార్పు తెచ్చింది. నన్ను క్షమించు. జీవితంలో వుండే నిరాశ, నిస్పృహలను యీవిధంగా ఎదుర్కొనగలవని నమ్ముచున్నాను. మీ జీవితం హాయిగా సాగిపోవాలని భగవంతుడిని ప్రార్థిస్తున్నాను" అంటూ మూర్తి ఆమె పాదాలను తాకాడు. భారతి అతని దీనమైన ముఖం చూడలేక పోయింది కాబోలు "తప్పుబావా!" అని మూర్తిని లేవదీసింది.

"మన భావాలకు, ఆలోచనలకు విరుద్ధంగా జరిగితే మనస్సుల్లో వ్యధ కలుగుతున్న మాట వాస్తవం బావా! యింతమాత్రానికే మనం

అధైర్యపడవద్దు. చిన్నతనములో మనం ఎన్నో అనుకుంటాం. అవన్నీ నెరవేరాలంటే ఎంతో పుణ్యం చేసుకొని పుట్టాలి" అంది.

ఆనాటి తన యీ పశుప్రవృత్తికి మూర్తి యిప్పుడు చాలా బాధ పడుతున్నాడు. అప్పుడు తనలో మంచిచెడ్డలు వివేకం లేకుండా పోయింది. ఇదంతా తన ఆదర్శానికి చాల విరుద్ధమని చాల బాధపడ్డాడు. "భగ్నప్రేమలు" మానవులలో దౌర్బల్యాన్ని పుట్టించి ఎలాంటి వినాశ మార్గంలోకి తోసివేస్తుందో అతడు బాగా తెలుసుకున్నాడు.

కాలగమనం మానవుల కష్టాలతో నిమిత్తం లేకుండా ముందుకు పోతున్నది. యింతవరకూ అత్తవారింటిలో దుర్భరజీవితం గడుపుతున్న భారతి జీవితం "సుడులు తిరిగే కడలి అలలలో" చిక్కుకున్న పడవ లాగా మారింది. ఆమె అదృష్టంకొద్దీ రెండు క్యాలండర్లు చినిగిపోక ముందే ఆమెభర్త పరలోకం చేరుకున్నాడు.

భర్త మరణించితే హిందూస్త్రీకి ఏగతి పట్టుతుందో యిప్పుడు భారతికికూడ అదే దుర్గతి పట్టింది.

పసిడి యౌవనంలో మిలమిల మెరిసే సౌందర్యంలో ఆమెకు అన్ని అలంకారాలు దూరమయ్యాయి.

రంగురంగుల చీరలు కట్టుకొని తలలో పువ్వులు పెట్టుకునే అధికారాన్ని లోకం అపహరించినది.

నిరాశా నిస్పృహలతో అగాధమైన బాధననుభవిస్తూ జీవితం గడుపవలసిందే....!

ఆమెలోని సహజమైన కోరికలను సంఘసనాతనాచారాలు బంధించి వేశాయి.

యిక్కడనుంచి మూర్తి జీవితం నూతనాధ్యాయంలో ప్రారంభ మైనది. నిర్దాక్షిణ్యంగా సమాజదండనలకు బలియై పోతున్న భారతిని

అతడు చూడలేక పోతున్నాడు. ఆమె తన సుకుమార సౌందర్యాన్ని కాలసర్పాలకు అంకితం చేస్తుంటే చూసి సహించలేక పోయాడు. భారతి అత్తవారిల్లు విడిచింది. రామశాస్త్రి యింట్లో కూడ ఆమెకు సుఖం లేకపోయింది. యింట్లో ఆమెను అందరు చిన్నచూపు చూసేవారు. ఆమెతో ఎవరూ మాట్లాడక పోయేవారు. పొద్దున్నే ఆమెముఖాన్నికూడా ఎవరూ చూడరు. ఒకవేళ చూసినా ముఖం చిట్లించుకునేవారూ. యీ విధంగా అంతకంతకు అతిశయించి పోతున్న భారతి కష్టాలను మూర్తి చూడలేకపోతున్నాడు.

పరిస్థితులను తను బాగా అర్థం చేసుకున్నాడు. భారతి పసుపు కుంకుమ దూరమై వైధవ్యంతో బ్రతకటానికి వీలులేదు. తన హృదయంలో ఆమెను ప్రేమ జ్యోతిగా వెలిగించుకోవాలి. తను యిదివరకే ఆమెను ప్రేమించాడు. అప్పుడు తనది కాలేదు. యిప్పుడు మరల ఆమెను పొందటానికి అవకాశం దొరికింది. ఈ అవకాశాన్ని తను జార విడుచుకో కూడదు. ఈ సత్కార్యానికి అడ్డమొచ్చే దుష్టశక్తులను ఎదుర్కొవటానికి సిద్ధపడ్డాడు. యీవిధంగా ఆలోచించిన తరువాత మూర్తి భారతిని పెండ్లిచేసుకోవటం సమంజసమని భావించాడు. ఇదే కారణాన వేలకువేలు కట్నాలు యిస్తామని వచ్చిన సంబంధాలను తృణీకరించాడు.

"మూర్తీ! ఇలా వచ్చిన సంబంధాన్నల్లా తృణీకరించటంలో నీ అభిప్రాయ మేమిటి?" రామశాస్త్రి కొడుకును ఎన్నోసార్లు అడిగాడు.

"యిప్పుడేం తొందరవచ్చింది. ఉద్యోగం దొరికిన తరువాత చేసుకుంటాను" తండ్రి అడిగినప్పుడల్లా మూర్తి సమాధానం చెప్పే వాడు.

ఒకరోజు భారతి తనగదిలో అద్దం ముందు కూర్చున్నది. తన

ముఖాన కుంకుమ పెట్టుకొని. గొల్లుమని ఏడ్చింది. తన జీవితమంతా ఈవిధంగా పాడై పోవలసిందేనా? ఇరుగు పొరుగుల వాళ్ళలాగా తనెందుకు ముస్తాబై తిరుగకూడదు? తన లలాటంలో భగవంతుడు యింతే వ్రాశాడా? అని భారతి మానవుని మనోభావాలు అర్థంకానట్లుగా బాధపడుతోంది.

అది చైత్రమాసం. మధ్యాహ్నపు ఎండలు నిప్పులు చెరుగుతున్నాయి. భారతి తనగదిలో కూర్చుని భగవద్గీత పారాయణం చేస్తోంది. ఆదినము మూర్తి తననిర్ణయాన్ని ఆమెకు చెప్పాలనే ఉద్దేశంతో అక్కడికి వెళ్ళాడు. భారతి తలంటి స్నానం చేసింది కాబోలు జుట్టంతా విరబోసుకొనివుంది. కిటికీలోనుంచి వీస్తున్నగాలికి ఆమె తలవెంట్రుకలు అలలమాదిరిగా యెగిరి, ఆమె ముఖంమీద పడుతూ, ఆమే ముఖానికి వింత శోభనిస్తున్నాయి. తెల్లటిచీరతో భారతి మూర్తీభవించిన సౌందర్యరాశిలా ప్రకాశించుతోంది. ఎంతసేపు చూసినా తనవితీరని ఆమె రూపాన్ని చూస్తున్నకొద్దీ అతని యౌవన హృదయం ఉప్పొంగిపోయింది.

"నీవువచ్చి ఎంతసేపైంది బావా?" అంది భారతి పారాయణం ముగించుకొని.

"యిప్పుడే భారతి!" అన్నాడు మూర్తి.

"కారణ మేమిటి..?"

"గీతా పారాయణం విందామని."

"అదృష్టానికి దూరమై ఇలా ఎన్ని పవిత్ర గ్రంథాలను పారాయణంచేస్తే ఏమి లాభం బావా!"

"ఇలా అదృష్టాన్ని దురదృష్టాన్ని మనమే సంకల్పించుకొంటాం భారతీ!"

"ఏమో బావా! నీవెప్పుడు వేదాంతిలా మాట్లాడుతావు" అంది భారతి నవ్వుకుంటూ.

"భారతీ....!" అన్నాడు మెల్లగా మూర్తి.

"ఏమిటి....?" అంది ఆశ్చర్యంగా భారతి.

"నీవిలా వైధవ్యంతో బ్రతుకటానికి వీలులేదు."

"మరేమి చేయమంటావు?"

"పెండ్లి చేసుకోమంటాను."

"ఎవరిని....?"

"నన్ను...."

"యిది ఎట్లాసాధ్యపడుతుంది బావా!"

"ఈ ప్రపంచములో సాధ్యముకాని దేముంది భారతి!"

"సంఘ సనాతనాచారాలను పరిత్యజించటం సాధ్యమా?"

"అర్థంలేని స్వార్థసంఘ నియమాలను తృణీకరించటం సాధ్యమే భారతి!"

"యిది భారత స్త్రీ ధర్మం కాదు"

"స్త్రీకి పునర్వివాహం అవసరంలేదు. మగవాడు చచ్చిపోతూకూడా మరో పెండ్లి చేసుకోవచ్చు. యిక్కడ ఏది ధర్మమో ఏది అధర్మమో నీవే ఆలోచించు భారతీ! భారత స్త్రీ ధర్మానికి కట్టుబడివుండాలనే నియమాన్ని కాదనను. ఆ ధర్మాన్ని అతిక్రమించిన నాడే మన దేశంలో స్త్రీ యొక్క గౌరవంనిలబడుతుంది. లేకుంటే ఇలా పురుషుల స్వార్థకల్పిత సంఘనియమాలలో నలగి పోవలసిందే!"

భారతి ఏమీ మాట్లాడలేదు. భారంగా నిట్టూర్పు మాత్రం విడిచి ఆకాశంలోకి చూసింది. సూర్యకిరణాలు కిటికీలోనుంచి చూసుకొని

లోపలకు వచ్చిపడుతున్నాయి. అక్కడక్కడ మబ్బుతునకలు వికృతాకారాలు కలిగి వున్నాయి. ఆమబ్బు తునకలకు భయపడింది కాబోలు "వద్దు బావా! నాజీవితం యేలాగూ నాశనమై పోయింది. నావిధి వ్రాత సేననుభవిస్తాను. నాకోసరం నీజీవితాన్ని నాశనంచేసుకోకు. నలుగుర్లో నీగౌరవం మంటగలసిపోతుంది. జీవితమంతా వాదోపవాదాలకు అప నిందలకు గురి అవుతుంది. లోకాన్ని కాదని అగాధమైన బాధతో జీవచ్ఛవంలాగా బ్రతుకలేము" అంది భారతి నిట్టూర్పువెంట.

"భారతీ! సేనుబాగా ఆలోచించే ఈనిర్ణయానికొచ్చాను. లోకంలో మనం ఎలాంటి శక్తులను యెట్లా ఎదుర్కొనాలో నాకు బాగా తెలుసు. కాని లోకానికి వెరచి మాత్రం నా ఆదర్శాలను దూరంచేసుకోలేను."

భారతి ఏకధారగా కన్నీరు కారుస్తోంది. ఆమె ముఖంలో కళా కాంతులు దూరమై పోయినవి. ముఖమంతా దుఃఖమలినమై పోయింది.

ఈస్థితిలో ఆమెతో మాట్లాడటం బాగా లేదనుకొన్నాడు.

"బాగా ఆలోచించి చెప్పు భారతీ!" అని గదినుంచి వెళ్ళి పోయాడు మూర్తి.

కాలచక్రం మామూలుకంటే వేగంగా పరుగెత్తుతోంది. ఈసంగతి భారతిని అప్పుడప్పుడు అడుగుతూనే వున్నాడు మూర్తి. కాని యింతవరకు ఆమె అతని కేసమాధానం చెప్పలేదు.

అది సాయంత్రం ఏడుగంటలు. సృష్టికి నూతన సౌందర్యాన్ని ఒనగూర్చేందుకు తూర్పుకొండలో పౌర్ణమీ చంద్రుడు తొంగిచూస్తు న్నాడు. ఆవెన్నెల వెలుగులో ప్రకృతంతా స్నానంచేసి తల ఆరబెట్టు కుంటోంది భారతి పెరట్లో గులాబిచెట్టుకు నీరుపోస్తున్నది. వికసించిన గులాబిపువ్వులు పండు వెన్నెలలో అతి మనోహరంగా గాలికి నృత్యం

చేస్తున్నాయి. మనోహర పుష్పాలను కలిగిన గులాబిచెట్టు ముట్టుకుంటె నిర్దాక్షిణ్యంగా కాటువేస్తుంది....?

"భారతీ....!" అన్నాడు మూర్తి అక్కడికివచ్చి. అనురాగోదయమైన ఆమె కన్నుల్లో ఆనందం లేదు. ఆమె దీనంగా మూర్తివైపు చూసింది.

"ఏమైనా నిర్ణయాని కొచ్చావా భారతి!" అన్నాడు.

భారతికూడ ఆలోచించు తున్నట్టుంది. తను ఒప్పుకుంటె తన కష్టాలన్ని దూరమైపోతాయి. తనజీవితం హాయిగా వెళ్లబారిపోతుంది అని నిశ్చయించుకుంది కామాలు "వీలులేదంటావా బావా!" అంది భారతి నిశ్శబ్దంగా, ఆశ్చర్యంతో, అమాయకంగా ముఖంపెట్టి.

"తప్పదు భారతి! లోకానికి భయపడి మనప్రేమలను దూరం చేసుకోవటంమంచిదికాదు; విజ్ఞత, వివేచనంలేని సమాజాన్నియెదిరించక తప్పదు. నాఆదర్శాలకు, అభిరుచులకు తగినదానవు. చిన్నతనమునుంచి మనమనస్సులు కలిసినవి. మధ్యలో మాసిపోయినవి. తిరిగి మరల చిగురించినవి. నాజీవితాన్ని నందనవనంలా చేయగల వనలక్ష్మివి. మనస్సులు కలిసినప్పుడు జీవితం మహాపరమానందంగా వుంటుంది" అని మూర్తి ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. మృదువైన ఆమె చల్లటి శరీరము, నల్లటి శిరోజములు అతనిని ఉద్రేకపరిచినాయి. ఈ స్పర్శానుభూతిలో భారతి పులకరించిన మేనితో అర్ధనిమీలిత నేత్రాలతో దీనంగా అతని ముఖంలోకి చూసింది. కంగారుపడుతున్న ఆమెముఖం, చెంపలమీద జారిపడుతున్న వేడికన్నీళ్ళు పాలభాగంపై సుళ్లు తిరుగుతున్న ఆమె ముంగురులు భారతి సహజ సౌందర్యాన్ని వికసింపజేస్తున్నాయి. వారి నిష్కామప్రేమకు ఆకాశంలోనుంచి తారా చంద్రులు దీవెనవెలుగును కురిపించారు. దూరాన మామిడితోటలో వనప్రియులు కూహూ(కూహూ(

మని కూస్తున్నాయి. పెరట్లో వికసించిన పూవులన్నియు స్వాగత సూచకంగా తలలు వంచాయి. కాని సమాజంలోని మబ్బుతునకల విషప్రనవ్వులు, కేరింతలు దూరాన్నుంచి అర్తనాదంలావినిపించాయి. ఆధ్వనికి భారతి భయపడిపోయి మూర్తిని గట్టిగా అదుముకొన్నది. ఆమెగుండె దడదడ కొట్టుకుంది.

కాలంగడచిపోతోంది. మూర్తి బి యి. ప్యాసుకావటంచే ప్రభుత్వంవారు యితనిని నాగార్జునసాగరమునకు యింజనీయరుగా నియమించారు. యింతవరకు మూర్తి పెండ్లి విషయంలో ఉద్యోగంసాకు చెప్తూ వచ్చాడు ఇక ఎట్లాగైనా భారతినితప్ప జీవితంలో యింకొకరిని పెండ్లి చేసుకోకూడదనే నిశ్చయాన్ని ఆరోజు మూర్తితండ్రికి చెప్పాలనుకొన్నాడు.

"మూర్తి! ఎందుకు పుట్టింది నీకీ దుర్బుద్ధి. యింతవరకూ మనల నిందించనిలోకం ఈనాడు నిందించుకోవటం నేను సహించను. నీవు బాగా చదువుకొన్నవాడవు. లోకజ్ఞానం బాగా యెరిగినవాడవు" అన్నాడు కోపంతో రామశాస్త్రి.

"క్షమించునాన్న! ఈవిషయంలో మీరు జోక్యం కలిగించుకోవద్దు. యిది నా ఆంతరంగిక విషయం."

"ఏం మాటలురా అవి? నీ ఆంతరంగిక విషయంలో మేము జోక్యం కలిగించుకోకూడదా! నీవలన కుటుంబం సర్వనాశనమైపోతుంటె చూస్తూ కూర్చోవలసిందేనా ఇదేనా ఉదారత్వం."

"బుద్ధి తెలిసేటంతవరకు బిడ్డలను పెంచి పెద్ద చేయవలసిన బాధ్యత తల్లితండ్రులది. అటుతరువాత వారికి సంపూర్ణస్వేచ్ఛ. అందుచే పెంచిపెద్ద చేసినందుకు మిమ్ముల జీవితాంతమువరకు గౌరవిస్తాను కాని నాఆశయాలకు, ఆదర్శాలకు మీరు అడ్డురాకూడదు".

"అయితే నీ నిర్ణయానికి తిరుగులేదంటావా"

"లేదు నాన్నా!"

"అయితే నీవు నా కొడుకువుకావు. ఈఆస్తిలో నీకు ఏమాత్రం హక్కులేదు."

"మీరు ఇలా అనగలరని నాకుతెలుసునాన్నా. క్షణికమైన ఐశ్వర్యం నేను ఆశించను. పాడు డబ్బుకొరకు నాఆశయాలను, ఆదర్శాలను అమ్ముకోను" అనిచెప్పాడు మూర్తి.

రామశాస్త్రి యికయేమి మాట్లాడలేదు. హుంకరించి లోపలికి వెళ్లి పోయాడు.

కాలచక్రం గంతులువేసుకుంటూ పరుగులెత్తుతున్నది. మూర్తి ఉద్యోగంలోచేరి అప్పుడే రెండునెలలు కావస్తోంది. వచ్చేనెల కార్తీక మాసంలో పెండ్లి ప్రయత్నాలు చేయమనీ మూర్తి తండ్రికి ఉత్తరం వ్రాశాడు. ఈసంగతి భారతికికూడ తెలియపరిచాడు. ఆదినము మూర్తి నాగార్జునకొండ ప్రాంతములో పర్యటించటానికి విహారం వెళ్ళాడు.

నాగార్జున కొండ ఆంధ్రులకు అపూర్వ దివ్యజ్యోతి. ఆంధ్రుల ప్రతిభను మహా ప్రభావంతో నలుదిక్కుల వెలిగించి దివ్యకాంతిలా ప్రకాశించుతోంది. యిక్కడి కళావైభవం చెప్పతరముకాదు. శిలాఫలకముల పై బుద్ధుని జాతకథలు చిత్రించబడినవి. అందులో మహాపద్ముడు తన సవతితల్లి ప్రణయమును తిరస్కరించుటచే అతనికి కల్గిన బాధలు హృదయానురంజకంగా చిత్రించబడినది. స్వర్గమునకు వెళ్ళు మార్గమునకు మాంధాత చక్రవర్తి నాగలోక రక్షణ కట్టడములు భేదించుట, దేవ లోకంలో ఇంద్రునితో సమానంగా మాంధాత చక్రవర్తి దేవతలచే గౌర వించబడుట, ఇంద్రుడు యింద్రశైలములో బుద్ధుని దర్శించుకొని స్వర్గ ములో తన పదవిని పొడగించమని వేడుకొనుట, యిత్యాది జాతక

కథలు కొనియాడ దగినవి. యింకా, త్రిరత్నములు, పూర్ణకుంభములు, స్థూపములు యిక్కడి స్థూప ఫలకములపై చెక్కబడినవి, ఈ శాసన ములను బట్టి క్రీ. పూ. రెండవ శతాబ్దము తరువాత శాలివాహన చక్ర వర్తుల అధికారం క్షీణించగనే ఈ ప్రాంతములో ఇక్ష్వాక రాజులు విజయపురిని రాజధానిగా చేసుకొని పాలించారని తెలయుచున్నది. మహా యాన బౌద్ధమతస్థుడైన ఆచార్య నాగార్జునుడు అంతిమకాలములో ఈ ప్రదేశములో గడిపినందువలన ఈ కొండకు నాగార్జునకొండని పేరు వచ్చినదట! యితడు గొప్ప శిల్పతత్వ శాస్త్రవేత్త. ఈ శాస్త్రములకు సంబంధించిన అనేక గ్రంథములు ఈయన వ్రాసెను. యిక్కడ వెల సిన విశ్వవిద్యాలయములకు విదేశాలనుంచి కూడ విద్యార్థులువచ్చి విద్య నభ్యసించేవారని తెలియుచున్నది. ఆంధ్రకళను నలుదిశల వ్యాపింప జేసిన నాగార్జునుని జ్ఞాపకార్థమే ఇచటికి సమీపమున నిర్మించే సాగరము నకు నాగార్జునసాగరము అని పేరు పెట్టినారు. ఇక్ష్వాకులనాటి విజయ పురి ఈ సాగరప్రాంతమున తిరిగి వెలస్తున్నందుకు ముక్కోటిఆంధ్రులు గర్వించాల్సిన విషయం. అహోరాత్రులు చమటోడ్చి ఆంధ్రులు యింత బ్రహ్మాండమైన ప్రాజెక్టును కట్టుకుంటున్నారంటె ప్రతి భార తీయుడు ఆనందించాలి. ఈయొక్క గౌరవం ఒక్క ఆంధ్రులకే కాదు దేశములోని ప్రతివారికి దక్కుతుంది. మూర్తి కొండప్రాంతములో అద్భుత విషయాలను చూసి యింటికి చేరుకునేవరకు సాయంత్రం ఏడు గంటలు కావస్తోంది. విజయపురి రంగురంగుల దీపాలతో రమణీయం గా వెలుగుతోంది. కృష్ణవేణి పిల్లగాలులతో సయ్యాటలాడుతూ గజ్జలు కట్టుకొని గలగల పాడుతోంది. మూర్తి భోజనం చేసిన తరువాత అలవాటు ప్రకారం ఆరోజు టప్పా చూసుకునేవరకు అందులో భారతి వ్రాసిన ఉత్తరం వున్నది. అది చదువుకునేవరకు అతనిలోని సర్వ నాడులు చల్లబడిపోయినవి. ఆకాశంపై నుంచి పిడుగు పడినట్లయింది.

ప్రియమైన మూర్తీ!

సమాజంలో మావంటివారికి స్థానంలేదు. మేము ఏ పని చేసినా వేయి కండ్లతో చూస్తుందీలోకం. తప్పులు యెంచి రచ్చకీడ్చుతుంది. ఈ లోకమంతా స్వార్ధపరులది. యిక్కడ ఎవరికి మంచి-చెడు సత్యం-అసత్యం కీడు-మేలులలో నిర్వచనాలు సరిగా తెలియవు. నీవు పోయిన తరువాత నేను బాగా ఆలోచించాను. భర్తగతించిన స్త్రీకి మరల భర్తను పొందే హక్కులేదు. ఒకవేళ సంఘనియమాలను కాదనినా నాజీవిత మంతా వ్యర్థం. నాకే కాకుండా ఇన్నాళ్ళు గౌరవంగా బ్రతికిన మీ వంశానికి తీరని కళంకం. ఆనాడు మామయ్యకు నీకు జర్గిన సంభాషణ విన్నాను. అంతా అర్థమైనది. పెద్దలపై అలాతిరుగబడటం మంచిదికాదు. పెద్దలను గౌరవించాలి. వాళ్ళు చెప్పినట్లు మనం నడచుకోవాలి. వారికంటె మనమే పెద్దలమనుకోవటం ఏమంత మంచిదికాదు. యిప్పటికే ఈ లోకం నామీద కారాలు మిర్యాలు నూరుతున్నది. నా జీవితం వంతెనమీద నడిచే తైలుబండిలావుంది. ఇక ఆలస్యం చేస్తే నాకు ఆశాభంగం కల్గుతుంది. లోకంలోని కాలసర్పాలు కాట్లువేసి బాధిస్తాయి. అందుకనే నేనీలోకంనుంచి దూరమై పోతున్నాను. యింతటి సాహసమైన పనికి పూనుకున్నందుకుక్షమించు. ఇహ నన్ను మరచిపో. నా కొరకు నీవు అనవసరంగా మనస్సును పాడుచేసుకోవద్దు. నీ జీవితంలో చిచ్చుపెట్టిన సమాజాన్ని దూషించకు. అలాచేస్తే అందరు నిన్ను పిచ్చివాడంటారు. ఇది లోకం తీరు.

ఇట్లు,
భారతి

ఇహ ఆలస్యం చేయకుండా భారతిని రక్షించుకోవలయుననే ఆశతో మూర్తి యింటికి చేరకునే వరకు శ్మశానంలో ఆమెశవం భగ

భగ మండుతోంది. మంటలు ధగధగ మెరుస్తూ ఆకాశాన్నంటుతూ న్నాయ్. ఆ జ్వాలలో నుండి లేచిన మంట నాచీకటి ముసుగులో లోకం చేసిన నేరాలను బయట పెడుతున్నది. ప్రపంచములో స్థానంలేని ప్రేమ జీవులకు తన హృదయంలో స్థానముందని సగర్వంగా చెప్పుతున్నాయి జ్వాలలు. ఇదంతా చూసిన ప్రకృతి సానుభూతి సూచకంగా పండుటాకు రాల్చింది. కాని ఆకాశంలోని మబ్బుతునకలు చిత్రవిచిత్రంగా నవ్వు కుంటూ పరుగులెత్తుతున్నాయి.

ఇంకేముంది తన ఆశాజ్యోతి బూడిదలో కలసిపోయింది. ఈ ప్రపంచంలో విద్యావేత్తలు, కళామూర్తులు, మహానాయకులు ఏవిధంగా ఈలోకాన్ని విడిచి పోతున్నారో అలాగే తన భారతి ఇహలోకాన్ని వీడి పోయింది.

మానవుడు ఇదంతా ఎందుకు తెలుసుకోడు? తనుకూడ ఒక నాడు ఈశ్మశానములో బూడిద కావలసిందేగా! మానవ ధర్మాల మరచి పోయి ఎందుకిలా చేస్తున్నారో అర్థంకాదు. జీవితంలో చావులేకుండా వుంటామనే ధీమాతో నవ్వుతారు. వేళాకోళాలాడుతారు. పాపపు పనులు చేస్తారు. తీయటి కలలు గంటారు. బుద్ధిలేని ఈ మానవచేష్టలకు యెంతమంది బలిఅవుతున్నారో కదా! మూర్తికి ఇదంతా తలుచుకునే వరకు ఈ సంఘాన్నంతా నమిలి మ్రింగెయ్యాలనిపిస్తోంది. కాని అత నిలో సహనం నశించి అసమర్థత విజృంభించుతుంది.

సముద్రంలో తుపాను చెలరేగుతుంది. ఆకాశంలో మబ్బులు ఆవరించినవి. రివ్వున చలిగాలి వీస్తున్నది. మూర్తి పూజారితో తనకథను చెప్పుకొని, శలవు తీసుకొని భారంగా అడుగులు వేసుకుంటూ తూర్పు దిశగా పోతున్నాడు. అతని దీనావస్థను చూచిన చంద్రుడు మబ్బుల్లో దాక్కున్నాడు.

మకరందాన్ని త్రావుదామని పరువులెత్తిన మూర్తి జీవితానికి ఎండమావులు అడ్డమొచ్చాయి. మల్లెలుపూసినట్లుగానే పూసి వాడి రాలి పోయినవి. కొంతకాలంపాటు ప్రశాంతంగా కాలం గడుపుదామని మూర్తి ఉద్యోగానికి సెలవుపెట్టి దేశ పర్యటన చేస్తున్నాడు. కాని ఎక్కడికి పోయినా అతనికి నిరాశ, నిస్పృహాలే....। అతని మనస్సుకు శాంతి లభించటంలేదు. తను ఎవరి కొరకు బ్రతుకాలో అర్థంకానట్లుగా పిచ్చి పిచ్చిగా ఆలోచించుకుంటూ తిరుగుతున్నాడు. తనలాగే కొంతమంది అభాగ్యులు లేకపోలేదు. వాళ్ళంతా ఎందుకు బ్రతుకుతున్నారు? భవిష్యత్తులో వాళ్ళకేదో కాంతికిరణం కనిపిస్తుంది కాబోలు....? కాని మూర్తికి యింతవరకు ఎలాంటి ఆశాకిరణం అగుపడలేదు. అతనికి భవిష్యత్తంతా చీకటిగానే వుంటూ వస్తుంది. ఆచీకట్లోనే అతని ఆశలు సుడిగుండంలో పడిపోతున్నాయి.



# పిచ్చివాడు

అప్పుడు నిండు చంద్రుని పండు వెన్నెల పిండారబోసినట్లుగా కాస్తోంది. తెరలు తెరలుగా వీస్తున్న చల్లటిగాలి హృదయానురంజకంగా వుంది. నేను వరండాలో కూర్చుని పండి ఒరిగిన నిండువెన్నెలను చూస్తూ దివ్యానుభూతులను పొందుతున్నాను. ఇంతలో బయట ఎవరో పిచ్చివాడు బాగా మాసిన గడ్డంతో, చిరిగిన గుడ్డలతో బక్కచిక్కిన శరీరంతో వీధిగుండా పోతున్నాడు. పిల్లలు అతనిని రాళ్ళతో కొడుతున్నారు. ఆ పిచ్చివాడు నవ్వుకుంటూ పోతున్నాడు. అతని శరీరం నుండి రక్తం కారుతుంది. ఈ విషాద దృశ్యం చూడగానే నా మనస్సు కరిగిపోయింది. నేనక్కడికి పరుగెత్తాను. నన్ను చూడగానే పిల్లలంతా ఎక్కడివారక్కడ పారిపోయారు.

"ఎవరునువ్వు? నన్నాపు జెయ్యకు. నారాధ దగ్గరకు నన్ను వెళ్ళనియ్యి" అంటున్నాడు. విచిత్రంగా నవ్వుతున్నాడు. అంతలో ఏడుస్తున్నాడు. రాధా అంటున్నాడు.

నేను ఎలాగో బలవంతము చేసి అతనిని యింటికి తీసుకవచ్చాను. ఆకలి వేస్తుందంటె అన్నము పెట్టాను. ఆయాసంగా మా యింటి అరుగుమీద నడుంవాల్చినాడు. నీరసమైన చూపులతో నింగిలోని నెలరాజు వంక చూశాడు. ఆచల్లటివెలుగును చూడగానే అతని హృదయ మెందుకో బాధగా మూలిగింది. అతనిలోని తీయని కోర్కెలు కన్నీరులా రూపొందినట్లున్నాయి. మాసిపోయిన మందహాసం మరల అతనిలో వికసించినట్లుంది. లోతుకు పోయిన అతని రెండు కండ్లు అవ్యక్తమైన ఆనందముతో తళతళమెరిసాయి. ఆ పిచ్చివాడు మరల నిశ్శబ్దాన్ని బద్దలు చేస్తూ రా....ధా....రాధా....అని అరుస్తూ గోడకు

తల బాదుకుంటున్నాడు. నేను పరుగున వెళ్ళి మరల అతనిని ఆదుకు న్నాను. నేనే పోకపోతే అతని గతి ఏమై పోయేదో చెప్పలేను. యిం తలో ఆకాశాన కారుమబ్బులు వ్యాపించినవి. పండు వెన్నెల కాళ రాత్రిలో కలసిపోయింది, అప్పుడు పిచ్చివాని హృదయం కొంచెము శాంతించినది. ఇదంతా నేను గ్రహించాను. వెన్నెలను చూడగానే యితడు బాధపడతాడు. రాధా రాధా అని అరుస్తాడు. ఈ వెన్నెలే యితని జీవితాన్ని తారుమారుచేసి వుండవచ్చు.

"ఏమిటీ బాబు ! రాధను తలుచుకొని మీరంతగా బాధపడుతారు.. ఆ రాధ ఎవరో నాకుచెప్పరూ" అని అడిగాను. ఎందుకో నా హృద యం ఆ పిచ్చివాని జీవిత గాధను తెలుసుకోవాలని తహతహలాడి పోతుంది. పిచ్చివాడు పగులబడి నవ్వుతూ "రాధ ఎవరో చెప్పాలా ! ఆమె నా ప్రేయసి. నా అందాలరాణి. నేనామెను హృదయ పూర్వకంగా ప్రేమించాను. అయినా మీకెందు కిదంతా. ఎదో మీరడిగారు కాబట్టి చెపుతాను వినండి. జీవితంలో నేను యింతవర కనుభవించిందేమీలేదు. దరిద్రకుటుంబములో పుట్టినా నేను భవిష్యత్తులో సుఖాన్ని ఆశించాను. రాధ అందచందాలను చూచి తీయటి కలలుగన్నాను. అసలు రాధ నా మేనమామకూతురు. మేముచిన్నతనములో ఒకేబడిలో చదువుకున్నాము.. బొమ్మరిండ్లు కట్టుకొని కాపురం చేశాము. గగన వీధిలో తారకలకు అందకుండా పరుగెత్తే చంద్రుణ్ణి చూస్తూ ఎన్నో గాలిమేడలు కట్టాము. కొండలపై నుండి పారే సెలయేళ్లను చూస్తూ దివ్యాను భూతులను పొందాము. చిలుకా గోర్వంకల్లా ప్రణయ జీవితం సాగిపోతుందని ఆశ పడ్డాము. మా అమ్మకు కూడ రాధంటె చాల ప్రేమ. ఆమె అపరూప సౌందర్యం, రంగురేఖలు చూసి మురసిపోయింది. ఎట్లాగైనా రాధనే తన యింటి కోడలుగా చేసుకోవాలని అమ్మ అభిప్రాయ పడింది. కాని మా అభిప్రాయాలు, ఆశయాలు, ఆదర్శాలు ఇలా నిశ్శబ్దంలో ఘనీ

భవించి పోతాయని మేమెన్నడూ అనుకోలేదు. అప్పుడప్పుడు అమ్మ రాధతో "రఘును చేసుకుంటావే!" అంటె రాధ సిగ్గుతో చిరునవ్వు నవ్వేది. నా కిప్పటికి జ్ఞాపకముంది. రాధ సమయం చూసుకొని కన్ను కదల్చకుండా నన్ను దొంగచూపులు చూసేది. నేను కూడ అప్పుడే విరసిన మల్లెపూవులాంటి ఆమె మొహం, చక్కగా తీర్చి దిద్దిన విశాల మైన కండ్లనుచూసి స్వర్గసీమల్లో తేలియాడే వాడిని. దినాలు గడుస్తున్న కొద్ది మా ప్రేమ లతలా అల్లుకపోయింది.

విశాఖ మాసపు సాయంత్రమది. అమ్మ మసక చీకట్లో మౌనంగా నిల్చొని వుంది. చీకటి పడుతున్నా ఇంకా దీపం వెలిగించలేదు. అమ్మ నన్ను చూడగానే బావురుమని ఏడ్చింది. ఆమె కన్నుల నుండి కన్నీరు కురుస్తుంది.

"ఏమిటమ్మా! అలా వున్నావు?" అని నేను అమ్మను ఆశ్చ ర్యంగా అడిగాను.

అమ్మ ఏమీ మాట్లాడలేదు.

"సుశీలా! ఏం జరిగింది? అమ్మ ఎందుకు ఏడుస్తుంది?" అని నేను చెల్లెలును అడిగాను.

అప్పుడు రాత్రి చాలపొద్దు పోయింది. మిణుకుమిణుకుమని ఆకా శంలో ప్రకాశించుతున్న నక్షత్రాలను చూస్తుంటే నాలో అనేక ఆలో చనలు మిణుకు మిణుకుమని మెరసి యెదలో బాధను కలిగిస్తున్నాయి. దీనితో నాహృదయభాండం ముక్కలు ముక్కలై పోతుంది. మా అమ్మ మాటలు నాచెవుల్లో యింకా గింగురు మంటున్నాయి. మామ య్యకు రాధను నాకివ్వటాని కిష్టం లేదట! మా పవిత్ర ప్రేమను ఆయన సంపదలకు ముడివేశాడు. దుర్భర దారిద్ర్యంలో, జీవితం గడిపే మాకు సంపదలెలా వస్తాయో మీరే చెప్పండి. ధనంలేని వారందరు గతిలేని

వారనీ, వట్టి చవటలనీ, దరిద్రనారాయణులనీ, తెలివితక్కువ దద్దమ్మ లనీ, ఈనాడు ప్రపంచం అంటుంది. ఇలాంటప్పుడు రాధను మామయ్య నాకెలా ఇస్తారు. ఆరాత్రంతా ఇలాంటి ఆలోచనలతో నామనస్సును పాడుచేసుకున్నాను. రోజులు గడిచినకొద్దీ నా ఆందోళన ఎక్కువ కా సాగింది. పండువెన్నెలను వెదజల్లుతూ నిండుచంద్రుడివలె ప్రకాశించే నా మనోహరిని మరచిపోలేకపోయాను. ఇలాంటి ఆలోచనలతో నేను చంచల మనస్కుడనైనాను. ఒకనాడు ఎవరికి చెప్పకుండా ఊరువిడిచి వెళ్ళిపోయాను. పిచ్చిపిచ్చిగా ఆలోచించుకుంటూ కొన్నాళ్లు దేశ సంచారం చేశాను. కాని. ఎటుపోయినా, ఏపని చేసినా నాకు రాధే జ్ఞాపకం వచ్చేది. ఎవరు పిలుస్తున్నా ఆమె పిలుస్తున్నట్లుగా భ్రమపడే వాడిని. ఇలా కాలగర్భంలో మూడు సంవత్సరాలు కొట్టుక పోయినవి. ఆరోజు నాకెందుకో యింటికిపోవాలెనని బుద్ధిపుట్టింది. తెల్లవారే మా వూరికి బయలు దేరాను. వెళ్లతూనే రాధకు చెప్పకుండా పోయినందుకు ఆమె కాళ్ళమీదపడి క్షమించమని వేడుకోవాలని నిశ్చయించుకున్నాను.

అది సాయంత్రం. ఆకాశంలో నిండుచంద్రుడు పండు వెన్నెలను వెదజల్లు తున్నాడు. నేను స్టేషన్‌నుంచి తిన్నగా రాధ యింటికే బయలుదేరాను. తీరా అక్కడికి వెళ్ళేవరకు యిల్లంతా పచ్చటి తోరణాలతో కన్నుల పండువుగా వుంది. ఒక్కసారే నాహృదయం బ్రద్ద లయింది. దుఃఖం పొర్లుకొచ్చింది. రక్తప్రసరణ క్షణకాలంపాటు ఆగి పోయింది. సొమ్మసిల్లి క్రింద పడిపోయే టంతటి పరిస్థితి ఏర్పడింది. పెండ్లి పందిరిలో నన్నందరు విచిత్రంగా చూసారు. ఆసమయంలో నన్నందరు పిచ్చివాడనుకోవచ్చు. నిజంగా నేనాసమయంలో పిచ్చివాడినే ఋంతలో పెండ్లిపందిరిలో ఏదో గందరగోళం బయలుదేరింది. నేను అటువైపు పరుగెత్తాను. తీరా అక్కడికి వెళ్ళిచూస్తే యింకేముంది. అంతా అయిపోయింది. రాధ విషం పుచ్చుకుంది. "రాధా" అంటూ నే

నామె భౌతికదేహంమీదపడి భోరున ఏడ్చాను. రాధ నాకొరకే ప్రాణ త్యాగం చేసిందా? నాకు తరువాత తెలిసింది. రాధ ఆపెండ్లికి యిష్టపడ లేదట! తనకు యిదివరకే బావతో పెళ్ళయిందనీ, జీవితంలో స్త్రీకి ఒక్కసారే వివాహ మవుతుందని చెప్పిందట! ఆమె ఎంత చెప్పినా ఎవరు వినలేదట. తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు. అన్నాడు పిచ్చివాడు బాధగా.

ఇంతలో ఆకాశంలో చంద్రుడు నక్షత్రాలు ప్రకాశవంతంగా మెరిశాయి. మక్కువగా తారను అక్కున చేర్చుకోవటానికి ప్రయత్ని స్తున్న నెలవంకను మరల పిచ్చివాడు చూశాడు. అతని హృదయంలో రాధ మెరసింది కాబోలు, రాధా, రాధా అని అరుచుకుంటూ ఆపిచ్చివాడు పరుగెత్తాడు ఎక్కడికో.

•

# ముద్రికా సహాయకులు

శ్రీ శీలం ఆల్వాల్ రెడ్డిగారు. శ్రీ తుమ్మలపల్లి వెంకట్రాంరెడ్డి గారు. శ్రీ దూదిపాల చెన్నారెడ్డిగారు. శ్రీ తుమ్మలపల్లి సీతారాంరెడ్డి గారు. శ్రీ తిపర్తి నారాయణరెడ్డిగారు. శ్రీ పి. సత్యనారాయణనాయుడు గారు. శ్రీ పల్లా పర్వతరెడ్డిగారు. శ్రీ దూదిపాల రాంచంద్రారెడ్డిగారు శ్రీ నాయిని రామిరెడ్డిగారు. శ్రీ నాయిని రంగారెడ్డిగారు. శ్రీ రామి నర్సిములుగారు. శ్రీ నలం రామచంద్రముగారు. శ్రీ పానగంటి కృష్ణయ్యగారు. శ్రీ గందె రాజయ్యగారు. శ్రీ తుమ్మలపల్లి కాశిరెడ్డి గారు. శ్రీ తుమ్మలపల్లి నారాయణరెడ్డిగారు. శ్రీ కలకొండ దేవయ్య గారు. శ్రీ తుమ్మలపల్లి మాణిక్యారెడ్డిగారు. శ్రీ తుమ్మలపల్లి రంగారెడ్డి గారు. శ్రీ గార్లపాటి దశరధంగారు. శ్రీ కలువ లక్ష్మయ్యగారు. శ్రీ నిరంగర్ పానగంటి లక్ష్మయ్యగారు. శ్రీ కందె రాములుగారు. శ్రీ బండారు చినమల్లయ్యగారు. శ్రీ గార్లపాటి రాజయ్యగారు. శ్రీ టి. మదన్ మోహన్‌రెడ్డిగారు. శ్రీ నర్సింహరావుగారు. శ్రీ కంచర్ల వెంకటరెడ్డిగారు. శ్రీ పొట్టిముత్తం తిరుపతయ్యగారు. శ్రీ పానగంటి మల్లయ్యగారు. శ్రీ సీల ఈశ్వరయ్యగారు. పైవారు అడిగిన క్షణమే అత్యంత ప్రియముతో తమ శక్తి కొలది యీ గ్రంథ ముద్రణకు సహా యం చేసినందుకు నా హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలియజేయు చున్నాను.

ఇట్లు,
రచయిత.